శ్రీ గురుభ్యోనమః.

---

శ్రీమదాంధ్రకవిశేఖరుండగు

శ్రీనాథకవీంద్రునిచే రచియింపంబడిన

# కా శీ ఖం డ ము.

ఈ గ్రంథము

లేఖకప్రమాదాదిజనితదోషరహితంబుగ

పండితులచేఁ బరిష్కరింపఁబడి,

వంకాయల - కృష్ణస్వామిశెట్టిగారి

స్వకీయ

శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపంబడియె.

చెన్నపట్టణము-౧౯౦౮ సం.



శ్రీగణేశాయనమః.

# కాశీఖండము.

## ప్రథమాశ్వాస ప్రారంభము.

శా॥ శ్రీకాశీనగరాధిరాజ్యపదవీ సింహాసనాధ్యాసిలో । కైకగ్రామణి విశ్వనాథుఁడు విశాలాక్షీమనోభర్త సు । శ్లోకున్ దొడ్డయయజ్వభూవర తనూజా న్వీరభద్రేశ్వర । శ్రీకాంతున్ గనబ్బగండని మహైశ్వర్యాప్తుంజేయుతన్ ॥ సీ॥ కంఠాగ్రకరిరాజుదుంటివిఘ్నేశుండు పడకుగుబ్బలికూఁతు కొమరుగుజ్జు । యాకాశమండలంబనునల్లగలువకు నకరువాద్యుండులోలార్కమూర్తి । గోపాలభామలగుబ్బచన్నుల మెచ్చు గీర్వాణవంద్యుండు కేశవుండు । కజ్జ్రపీడా ఘోరాస్యకటిగోపురద్వారపరిరక్షకుఁడు కాలభైరవుండు । గాలకంఠునిశిరసుపూఁ గగనగంగ । కాశికాక్షేత్రమున కేడుగడయునైన । యుందఱును నిత్తురెల్లప్పుడీప్సితమ్ము । లల్లభూపాలువీరభద్రాధిపునకు ॥ సీ॥ కబరికాభారంబు గ్గై పెక్కువిరులతో నవటుభాగంబుపైన త్తమిల్ల । నలఁతి వేఁజెమరుచేనసలు కొన్నలలామ కుంకుమంబునఁ జిన్నికురులుమునుఁగఁ । బసిఁడికుండలఁబోలు పాలిండ్లభరము సనన్నపుఁగౌఁదీఁగ జలదరింపఁ । దరళతాటంక రత్నప్రభారింఛోళి గండస్థలంబులఁ గ్రాఁగిలింపఁ । గాశికారామకల్పవృక్షములనీడఁ । గుతపవేళలయందు నాకొన్నవారి । కమృతదివ్యాన్నమిడువిశాలాక్షిగౌరి । శాశ్వతైశ్వర్యములుగృతిస్వామికొసఁగు ॥ ఉ॥ పాయకనిర్నిరోధ నిరపాయసమగ్ర కృపాగుణైకపా । రాయణతావిలాసము దిరంబుగనంబుజసూతివీరనా । రాయణుదానవైభవ ధురంధరునంగరసవ్యసాచిదీ । ర్ఘాయురుపేతుఁజేయుత నృపాగ్రణినల్లయవీరభద్రునిన్ ॥ గీ॥ కంఠపీఠిక నోంకార ఘంటమొఱయఁ । జెలఁగుఁగావుత మన్మనఃక్షేత్రసీమఁ । గవికుటుంబంబుపాలిటి దివిజసురభి । జలజసంభవుబోఁటి భాషావధూటి ॥ వ॥ అని సముచితప్రకారంబునఁ బూజ్యపూజాతత్పరుండనై యొక్కనాఁడాత్మగతంబున నిట్లని వితర్కించి॥ సీ॥ చిన్నారిపొన్నారిచిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర । నూనూఁగుమీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి । సంతరించితి నిండుజవ్వనంబునయందు హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ । ప్రౌ

ఘనిర్భరవచనకవి పరిపాకముచేఁ గొనియాడిరి భీమనాయకునిమహిమఁ । బ్రౌ
ఢిమింతకుమిగులఁగై వ్రాలకుండఁ । *గాశికాఖండమను మహాగ్రంథమేను।
దెనుఁగుఁజేసెదఁ గర్ణాటదేశకటక । పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి॥
ఉ॥ స్కాందపురాణసంహితకు ఖండములేఁబదియందులోనవా । నందవనాను
భావ కథనంబున శ్రోతకు వక్తకున్ శుభా । నందపరంపరావహము నైజగు
ణంబునఁ గాశిఖండమా । కందువయై నెఱింగి సమకట్టితిఁ గావ్యముగా నొన
ర్పఁగన్॥ వ॥ ఇమ్మహాప్రారంభంబు కర్ణకర్ణికావశంబున నాకర్ణించి క
ర్ణాంత విశ్రాంత విశాలనేత్రుండును, బంటవంశ కమల మిత్రుండును, వ
శ్రాంత విశ్రాణన క్రీడాపరాయణుండును, వీరనారాయణుండును, నిత్య
సత్యుండును, బల్లహాదిత్యుండును, భూభువనభారభరణ దీక్షాదక్షదక్షిణభు
జాభుజంగుండును, రాయవేశ్యాభుజంగుండును, గీర్గంగాతరంగిణీ ప్రవా
హపవిత్రితస్వర్గమర్త్యపాతాళుండును, జగనగోపాలుండును, విమలధర్మ
శీలుండునునగు నల్లయ వీరభద్రభూపాలుం డొక్కనాఁడు॥ సీ॥ త్రైలో
క్య విజయాభిధంబైన సౌధంబు చంద్రశాలాప్రదేశంబునందు । సచివసై
న్యాధీశ సామంతనృపవార సీమంతినీ జనశ్రేణిగొలువ । శాస్త్రమీమాంస
యు సాహిత్యగోష్ఠియు విద్వత్కవీంద్రులు విస్తరింపఁ । గర్పూరకస్తూరికా
పంకమదగంధ సారసౌరభముదిక్పూరితముగ । నిజభుజావిక్రమంబున నిఖిల
దిశలు । గెలిచి తనురాజ్యపీఠ మెక్కించినట్టి । యన్న వేమేశ్వరుని యంకమా
శ్రయించి । నిండుకొలువుండె గన్నులపండువగుచు॥ వ॥ అప్పుడు నన్నుం బి
లువంబంచి సముచితాసనంబునం గూర్చుండ నియమించియున్న యవసరం
బున॥ గీ॥ రాయవేశ్యాభుజంగసంగ్రామపార్థ । గాయగోవాళ వేమనక్ష్మా
వరుండు । కూర్మియనుజన్ము హృదయంబు గోర్కి యెఱిఁగి । యర్థి నన్నుఁ
జూచి యిట్లని యానతిచ్చె॥ సీ॥ వచియింతు వేములవాడభీమనభంగి నుద్దండ
లీలనొక్కొక్కమాటు । భాషింతు నన్నయభట్టుమార్గంబున నుభయవా
క్ప్రౌఢి నొక్కొక్కమాటు । వాక్రుత్తు దిక్కయజ్వప్రకారము రసాభ్యుచితబం
ధముగ నొక్కొక్కమాటు । పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శైవ సూక్తివైచి
త్రి నొక్కొక్కమాటు । నైషధాదిమహాప్రబంధములు పెక్కు । చెప్పినాఁడవు
మాకు నాశ్రితుఁడవనఘ । యిపుడు చెప్పఁ దొడంగిన యీప్రబంధ మంకితము సే
యు వీరభద్రయ్య పేర ॥ శా॥ ఈక్షోణిన్ నినుఁ బోలు సత్కవులు లేరీ నేఁటి కా
లంబునన్ । దాక్షారామచళుక్యభీమవర గంధర్వాప్సరోభామినీ । వక్షోజద్వ
యగంధసారఘుసృణ ద్వైరాజ్యభారంబున । ధ్యక్షించున్ గవిసార్వభౌమ

ఠవదీయప్రౌఢసాహిత్యముల్॥ వ॥ అని యనంతరంబ కర్పూరవసంతరాయండు
వీరభద్రేశ్వరుండు కర్పూరతాంబూలసహితంబుగా జాంబూనదాంబరాభర
ణంబులిచ్చినం బరిగ్రహించి॥ సీ॥ ఆంధ్రక్ష్మామండలాఖండలుండైన వే
మభూపతికృపావీక్షణంబు। ఘోడెరాయాంకసద్గురురాజ భీమేశ్వరస్వామి పద
సమారాధనంబు। కమలాద్రినిలయమార్కండేయశివమౌళి చంద్రాంశునవ
సుధాసారధార। వేదాద్రినరసింహవిపులవక్షస్స్థలీ కల్హారమాలికాగంధలహ
రి। కారణంబులునుద్బోధకములుగాఁగ। సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁబ్రబంధవిభునిజేసి। కాశికాఖండము దెనుఁగుగానొనర్తు॥
గీ॥ కలిగెఁబదియాఱువన్నెబంగారమునకుఁ। బద్మరాగంబుతోడినంపర్కల
బ్ధి। కాశికాఖండమనుమహాగ్రంథమునకు। నాయకుఁడువీరభద్రభూనాథుఁడ
గుట॥ వ॥ అని తన్మహాప్రబంధకల్పనా కుతూహలాయత్తచిత్తుండనై॥ సీ॥
బాదరాయణుపాదపద్మంబులకుమ్రొక్కి। ప్రాచేతసునిమనంబునవినిలిపి। భట్ట
బాణమయూరభవభూతిశివభద్ర కాళిదాసులమహాకవులఁదలఁచి। రాజశే
ఖరునిభారవిమాఘుఁగీర్తించి ప్రవరసేనుని దండిభానుఁదలఁచి। హర్షుబిల్హ
ణునిమల్హణుఁజోరుఁగొనియాడి క్షేమేంద్రజిత్పుఁజిత్తగించి। శబ్దశాసనునన్న
పాచార్యవర్యు। సత్కవిశ్రేష్ఠుఁదిక్కయజ్వనుభజించి। నత్ప్రబంధమహేశ్వరు
శంభుదాసు। నధికతరభక్తిసంయుక్తినాదరించి॥ గీ॥ మత్పితామహుఁడగు పి
తామహునిదలఁతుఁ। గలితకావ్యకళాలాభుఁగమలనాభుఁ। ఇంద్రచందనమం
దారసదృశకీర్తి। సరససాహిత్యసామ్రాజ్యచక్రవర్తి॥ వ॥ అని యనంతరంబ
కృతీశ్వరు నభివర్ణించెద॥ సీ॥ కలశాబ్ధికన్యకాకరపల్లవద్వయీ సంవాహన
క్రియాసముచితంబు। నిఖిలవేదాంతవాణీవధూధమ్మిల్ల బహుళపుష్పామోద
భావితంబు। ప్రణుతనానాసుపర్వకిరీటసంఘాత రత్నాంశునీరాజితంబు।
సనకాదిసన్మునీశ్వరమనోమంటపాభ్యంతరరత్నదీపాంకురంబు। పతగకేతను
శ్రీపాదపంకజంబు। గారణంబుగజన్మించెభూరిమహిమ। గంగసయిదోడురిపు
కోటిగళముత్రాడు। నాలుగవజాతిసమధికోన్నతవిభూతి॥ శా॥ ఆవర్ణంబున
సుద్భవించి గుణరత్నార్ణోనిధానంబు శ్రీ। దూపూరం బొనుమాణి రెడ్డియభివృద్ధు
ల్గాంచెమృత్యుంజయ। గ్రీవాత్వైళకళంకపంకహరణ క్రీడాకళాగర్విత। ద్యా
వాపృథ్వ్యవకాశపేశల యశోధారాసభస్సింధువై॥ గీ॥ అతనియర్ధాంగల
క్ష్మిశ్రీయన్నమాంబ। గాంచెఁదనయులనర్థార్థికల్పతరుల। నల్లయాధీశపెద
కోటయన్నప్రోల। కువలయేశదొడ్డయపిన్నకోటవిభుల॥ సీ॥ అవనిభారధురీణ
బాధరీకృతమహా క్రోడప్రధానమల్లాడనృపతి। ధాటీసమాటీకనాటోపవిధ్వ

త్త కుటిలాహితుఁడు పెదకోటశౌరి। పంటాన్వయక్షీరపాథోధిసంపూర్ణ పూ
ర్ణిమావిధుఁడన్నప్రోలవిభుఁడు। ప్రోద్దామ సుప్రతాపోదయవ్యతికర స్థా
యాధికుండు దొడ్డాయరెడ్డి। హాటకాచలధీరుండు మేటిబిరుదు। పాటికలవాఁ
డు కరహాటలాటఘోటకర్ణాటదేశరాట్కటకసుకవి। కోటినుతకీర్తి
శ్రీచిన్నకోటరెడ్డి॥ గీ॥ పంటకులరాజు దొడ్డభూపాలునకును। బరమకల్యాణి
యన్నమాంబకును సుతులు। ప్రోలభూపతియును గోటభూపతియును। భువన
నుతకీర్తి యల్లాడభూపతియును॥ అందు॥ సీ॥ కుటిలారిరాట్కాంత కుహరాం
తములఁగాని క్రీడింపనీఁడు శౌత్తేయకాహి। హరిదంత సౌధశృంగాగ్రవీథులఁగా
ని తిలకింపనీఁడు కీర్తిధ్వజంబు। స్వాశ్రితబంధుమిత్రారామములఁగాని సాఁగ
నీఁడు కృపావసంతలక్ష్మి। హరిణభృన్మూర్ధన్యచరణాబ్జములఁగాని మరుడనీఁ
డునిజాత్మమధులిహంబుఁ। బ్రళయసంరంభ శుంభదారభటిపటిమ। భయద
ఫాలాక్ష ఫాలసంభవదభంగ। దహనమహనీయ దివ్యప్రతాపవిసర। దనుజ
జమహారి దొడ్డయయల్లశౌరి॥ మ॥ జయధాటీసమయంబులన్ విలయ ఝంఝా
మారుతాడంబరా। న్వయరంహఃప్రవిజృంభమాణఘన నిస్వానోగ్రభేరీస్వనం।
బయిరెయొడ్డాదిభయంకరోద్దమన శౌర్యంబైన శ్రీరెడ్డిదొ। డ్డయయల్లాడనృపా
లుపాలునకు బిట్టలాఁడుదిక్చక్రకముల్॥ మ॥ లలితాహంకృతి దొడ్డభూవరుని
యల్లాక్ష్మానాథునా। జలమార్గ్యన్న విరోధిరాజులమర స్తుత్యప్రతాప
ప్రభా। కలితశ్రీయుతులై సుఖంతు రెలమిం గల్యాణశైలంబుపైఁ। గలధౌతా
మలహర్మ్యరేఖలమను త్యాంతాను చాగ్రంబులన్॥ మ॥ అనవేమక్షితిపా
లుపౌత్రియుగు వేమాంబామహాదేవికిన్। ఘనుఁడయ్యల్లడ భూమిపాలునకు స
త్సౌగామృస్థలీగాండివుల్। తనయుల్వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు దొడ్డ
ప్రభుం। డనుసన్నుత్యాయుబాహువిక్రమకళాటోపప్రతాపోద్ధతుల్॥ వ॥
అందగ్రజుండు॥ మ॥ కొనియెన్ గంచుకముల్ సముద్భటపట ఘోటీభటప్రౌఢి
నై। కొనియెన్ స్వేదుకఁ చేసి కాడ యహితక్షోణీశులల్లాడఁజే। కొనియెన్నాక
వరంబు నీక మదవద్ఘోరారిసంహారియై। ఘనుఁడల్లాడమహీశు వేమన నిరా
ఘాటైకధాటీగతిన్॥ సీ॥ పన్నసూడియరాయచంద్రబింబాననా చికురవల్ల
రులపైఁ జన్నిపువ్వు। ఝాడెబంతుర్నాటి జననాథశుద్ధాంత కుచకుంభముల
మీఁదికుంకుమంబు। పారహదొంతిభూపాలలీలావతీ గండస్థలంబులఁగలికిన
వ్వు। కలువపైయొడ్డాదికటకాధిపతివధూ సీమంతవీథులఁజేరుచుక్క। యల్ల
డాధీశ వేమక్ష్మాధినాథ। భూరినిష్ఠుర ధాటీవిహారచటుల। సైన్యనాసీరతు
రగఖురపుటోద్ధ। వింధ్యపార్శ్వ వసుంధరా విపులధూళి॥ సీ॥ ఘంటునా

సురధాణి పావడంబిచ్చిన భద్రేభములు వీక్షింపఁ బాగ్యముండదు। నొడ్డధాత్రీనా
థుఁడుపదఁబుత్తెంచిన బింబారుణోష్ఠీసంజెలవహించుఁ। గర్ణాటభూపతి కా
నుకయనిపిన ముక్తాతపత్రంబు మ్రోలమెఱయు । యవనాధిపతియుపాదుష
ముగానొసఁగిన పాగాహయంబులువాగెవచ్చు। దూరమంతెంత బారహా దొం
తిమన్న। సప్తమాడియ రాజన్యసమితి మ్రొక్కు । రాయవేశ్యాభుజంగ సం
గ్రామపార్థ। గాయగోవాళ వేమసత్క్ష్మాధవునకు॥ క॥ చటులలితనల్ల యవేమన।
పటుధాటీవిజయభేరి భాంకృతులైనయ్యెఁ। ఇటసామజహారిసమధిక। కటుకంఠ
గభీరఘహార కహాకహారవమ్ముఁ॥ సీ॥ ధరియింపనేర్చిరిదర్భ వెట్టెడువ్రేళ్ల లీల
మాణిక్యాంగుళీయకములు। కల్పింపనేర్చిరిగంగమట్టియమీఁదఁ గస్తూరికా
పుండ్రకములునొసల। సవరింపనేర్చిరిజన్నిదంబులమ్రోలఁ దారహారములు
ముత్యాలసరులు। చెరువంగనేర్చిరిశిఖలనెన్నడుములఁ గమ్మనిక్రొత్తచెంగ
ల్వవిరులు। ధామముల వెండిబైఁడియుఁ దడఁబడంగ। బ్రాహ్మణోత్తము ల
గ్రహారములయందు । వేమభూపాలుఁడనుజన్ము వీరభద్రు । ధాత్రియేలింప
గాతవిూతటమునందు॥ గీ॥ ప్రకటశాఖోపశాఖలఁ బంటవంశ్యుఁ। డుద్ధరించి
నవేమేంద్రుఁ డుదయవేళ। శివువిశాఖుని తంద్రిఁ బూజించుభక్తి। లలితబిల్వ
త్రిశాఖఫలాళిసమితి॥ సీ॥ త్ర్యంబకాచలకన్యకాంబుపూరంబున నఘమర్షణ
స్నానమాచరించి। నిద్ధమైనమడుంగునీర్కావిదోవతి కనక మేఖలతోడఁగటి
ఘటించి। మూలమంత్రోక్షరంబుల భూతిమంత్రించి పుండ్రకంబుగఫాలమున
ధరించి। క్రొత్తముత్యములతోరుద్రాక్షమాలిక లష్టోత్తరశతంబుల బులెఁదా
ల్చి। పుండరీకాజనముఁ గూర్చుండిశంభు। నర్చనముఁ జేయునపుడు మహాప్ర
మథుఁడు। చాలనొప్పారు రెండవశంభువట్లు । వీరనారాయణుఁడు రెడ్డివేమ
విభుఁడు॥ శా॥ చంచల్లీలలహస్తకంకణమణి చ్ఛాయల్విపాళింపఁబూ। జర
చు న్వేమమహీవిభుండు నవరాజీవంబులన్ గల్వలన్ । బ్రాంచత్కాంచనపు
ష్పకేసరములం బ్రాసాదపంచాక్షరిన్। మంచుంగొండయనుంగుఁ బెండ్లికొ
డుకున్ ,మధ్యాహ్నకాలంబునన్॥ వ॥ తదనుసంధ్యవుండు॥ ఉ॥ రాజశశాంక
శేఖరుఁడు రాజకిరీటనతంసమష్టది । గ్రాజమనోభయంకరుఁడు రాజులదేవర
రాజరాజశ్రీ। రాజమహేంద్రభూభువన రాజ్యరమారమణీమనోహరుం। జా
జఁగిరీటికీర్తినిధి యల్లయవీరనరేంద్రుఁడున్నతిన్॥ మ॥ మనుతుల్యుండగుగాట
భూవరుని వేమక్ష్మాతలాధీశునం। దనఁ బాణిగ్రహణంబుచేసి ప్రియమొందన్
వీరభద్రేశ్వరుం। డనితల్లిన్వినతామతల్లి నుదయాస్త్రాద్రీంద్రసీమావసీ। ఘనసా
మ్రాజ్యసమర్థసుప్రథిమ సాక్షాదిందిరాదేవతన్॥ గీ॥ అట్టిసీతెల్లి పుణ్యగుణాఢ్య

రాముఁ! దనకుఁబట్టంపు దేవిగా ధన్యలీల । వసుధ యెల్ల నేకాతపవారణము
గ! నేలునల్లయ వీరభద్రేశ్వరుండు॥ సీ॥ మకరకుండలవజ్ర మాణిక్యదీప్రులు
చెక్కుటద్దముల పైఁ జీరువాఱ! డాకాలిగండ పెండారంబు దాళున బొమ్మలై వై
రిభూభుజులు వ్రేల! గలయంగ నలఁదిన కస్తూరి సెత్తావి యష్టదిక్కులయందు న
వఘళింప । మొగము చూచిన మాత్రమర్ధాభిషిక్తులు మోడ్పుఁ జేతులు హ
స్తముల ఘటింప! మెఱుఁగుదీఁగెలఁ బోలు భామినులు గొలువ । నిండు కొలు
వుండెఁ గన్నులపండువగుచు । రాయవేశ్యాభుజంగ వీరప్రతాప । విభవుఁడ
ల్లాడభూపతి వీరవిభుఁడు ॥ స్రగ్ధర ॥ జంభారాతీభ జోభా చకచకనిభముల్
శాంభవీయాట్టహాసా । రంభావష్టంభ రేఖా రథటిలటహముల్ రాజరాజా
ద్రి తేజ! స్సంభార భ్రాంతిదంబుల్ సకలభువనదీక్షా కరంభంబులయ్యెం! జృం
భించు ర్వీరభద్ర క్షితిరమణు యశశ్రీ వధూవిభ్రమంబుల్ ॥ క॥ లేరీధరణిపు
లళ్లయ! వీరక్ష్మాపతికి సాటి వితరణగరిమన్ । ధారాధర ధారాధర! ధారాధర
వాహదాన ధారానిధికిన్ ॥ సీ॥ గోదావరీపావనోదకంబుల హేమకలశశతం
బులజలకమార్చుఁ । గర్పూరకస్తూరికాకుంకుమంబులఁ గలపంబు గూర్చి శ్రీ
గంధమలఁదు! సప్తగోదావర స్వర్ణపుష్కర హేమ సౌగంధికములనర్చన మొ
నర్చుఁ! గలధౌతపాత్రలఁ గాలాగరుచ్ఛేద బహుళధూపంబులు పరిఢవించు!
వేన వేలు నివాళుల విస్తరించు! నమృతదివ్యాన్నముల నుపహారమిచ్చు । సం
ఘటించు నశేషోపచారములును । బ్రమథనాయకునకు వీరభద్రనృపతి॥ చ॥
విలసితకీర్తిశాలియగు వీరమహేశ్వరు దేహరంబు శ్రీ! నిలయము నం ద్రిసంధ్య
మును నిర్మలసౌధసువర్ణ జాలకం । బుల వెడలున్ గిరీశగళ మూలహలాహ
లకాంతిఁ బోలిగు । గ్గులమహిషాక్షి వాసనలఁ గ్రొవ్విన మంగళధూపధూమ
ముల్ ॥ ఉ॥ ఈశ్వరుఁడింటివేల్పు జగదేకగురుండ గుహాధిరాయభీ! మేశ్వరుఁ
డాత్మవంశగురుఁ డీగులు నిత్యవినోదకృత్యముల్ । శాశ్వతధర్మకీర్తులు దలం
పఁగనమ్మినసొమ్ములాదిగ । ర్భైశ్వరుఁడంటనైజ తెనయే నృపులళ్లయ వీరశౌరి
కిన్ ॥ సీ॥ తెంచు నెవ్వని హేతిదృప్తారినరవర గ్రైవేయ పరిలసత్కంధరముల ।
ముంచు నెవ్వని కీర్తి ముగ్ధేందుధర కంఠ కాకోలవిషమషీ కాళిమంబు! బెంచు నె
వ్వని బుద్ధి పంచాస్త్రపరిపంథి పాదపాథోజతాత్పర్యచర్య । మించు నెవ్వని మూ
ర్తి మీనచిహ్న జయంత నలకూబరాదుల నలిజయించి! యతఁడు పొగడొందు
రాయవేశ్యాభుజంగుఁ! డవధిమహీధర చరమగాఢాంధకార! ధట్టఘట్టన పట
హప్రతాపతపనుఁ! డళ్లనరనాథుఁ దొడ్డభూవల్లభుండు॥ శా॥ ఔరాయళ్లయ
రెడ్డిదొడ్డవసుధా ధృత్కుంభు ధాటీచమూ । భేరీభాంకృతి ఘోరఘోషమున

నిర్భేదించె నొడ్డాదిశ్యం। గారంకోటయు లోతుగడ్డయును నుద్ఘాటించె నత్యుద్ధ
తిన్। క్షీరాంభోధితటంబు నన్నిలిపె దిక్సీమాజయస్తంభముల్॥ మ॥ హరిఁ
దాఁటించెం జెఁబురోలు కంఠముల వాహ్యాళిప్రదేశంబునం। దరుదేయళ్ళయ రెడ్డి
నందనుఁడు దొడ్డయ్యక్షమాధీశ్వరుం। డిరువైనాలుగుమూళ్ళమేర యడిపోనె
క్కింపంగా నేలయు। ద్ధరణీనాథునికీర్తిఁ దాఁటెఁ గడునుద్దండించి బ్రహ్మాండ
మున్॥ మ॥ నరిలేరీజలరాశివేష్టిత మహీచక్రంబున న్విక్రమా। పరగాండీవికి
జక్రవాళమహీభృత్పర్యంత విశ్వంభరా। ద్ధరణప్రౌఢభుజాభుజంగమునకున్
ధాత్రీశులల్లాడ భూ। వరు నన్నయ్యకుమారవాఙ్మయకళావైకుంఠ రాట్సయ్య
కున్॥ సీ॥ జిష్ణువైభవరేఖఁ జెలువొందుటయుఁ గాక పావకవిస్ఫూర్తిఁ బరఁగు
టెట్లు। ధర్మరాజువిభూతి దర్పించుటయుఁ గాక పుణ్యజనోపాఖ్యఁ బూను టె
ట్లు। మహేంద్రచేతోరీతి మహిమ దాల్చుటగాక తగ జగత్ప్రాణాఖ్యఁ దాల్చు
టెట్లు। ధనదత్వవిఖ్యాతిఁ ఘనతనొందుటగాక శంకరసుషము చేజరగు టెట్లు।
తెలిసి దిక్పాలకాంతావతీర్ణుఁ డగుట। భోగమున శుద్ధి సూనృతమున జయమున।
నాజ్ఞ బలమున ధనమున నధికకరుణ। నళ్ళభూపాలనందనుఁ డల్లవిభుఁడు॥ ఉ॥ వల్ల
కిచక్కిఁ గాహళయు వంశము ఢక్కహుడుక్కజర్ఝరుల్। ఝల్లరియాదిగాఁగ
లుగు శబ్దపరంపర తాళశబ్దమై। యుల్లసిల్ల ప్రబంధములకొప్పుగ నాడుదు రగ్ర
వేదిపై। ల్లవపాణులీశ్వరుని బంటమహీశులు పూజసేయఁగన్॥ శా॥ మా
ర్కండేయమహేశ్వరుం డఖిలసామ్రాజ్యంబుఁ బాలింపఁగా। నర్కేందుల్గల
యంతకాలము తదీయాంఘ్రిద్వయీభక్తిసం। పర్కోదంచితభాగ్యసంప
దల నాత్మామండలీవల్లభుల్। కోర్కుల్ నిండఁగ సేవకత్వమునఁ గైకొండ్రా
యురైశ్వర్యముల్॥ సీ॥ ఉండు నేశ్రీలమార్కండేయమునినాథ సజ్జలింగము నం
గశాసనుండు। ప్రవహించు నేపీటి పశ్చిమప్రాకార మొరసి గంగమ్మ సాగరము
కొమ్మ। యావిర్భవించినాఁ డేపీటికోటలో వలభేది మదనగోపాలమూర్తి।
పాలించు నేపీటి ప్రాగుదక్కోణంబు సుమహోదిశ్శ్రీముల్ల గూరిశక్తి। ప్రబలధా
రాసురత్రాణ భద్రజాతి। కరిఘటాసైన్యదుస్సాధకనకలోహ। గోపురద్వార
కవాటప్రదీపితమతి॥ సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము॥ మ॥ కలపుం
స్కోకిలకంఠకోమలకుహూకారస్ఫురత్పంచమ। స్థలదధ్వవ్యములైన కాల
ముల మార్కండేయనాథేశ్వరున్। లలితక్రీడలవీరభూపతివసంతం బార్చున
వ్వీటిపై। ఘులఁగర్పూరహిమాంబుసంకుమద కస్తూరీపటీరంబులన్॥ ఉ॥ ప్రా
కటవిక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా। నేకసితాతపత్రమున నేలు
సువీరన్నపాలుఁ డుత్తమ। శ్లోకుఁడు వేమశౌరి యనుజుండు సమున్నత వైభవా

ధుర్యుఁడై। చీకటియుఁ గళింగయును జల్కసముద్రముసింహాశైలమ్మున్॥

—*( షష్ఠ్యంతములు. )*—

క॥ ఈదృశగుణగణనిధికిని। వేదార్థకవిత్వతత్త్వవిధివిత్పతికిన్। తన్మాదివిజ
కవిజనాళి। ర్వాదప్రాగేయుమానవై భవనిధికిన్॥ క॥ తుంగాకారభేతాళున। క
రిభయదభుజాపరాక్రమాభీలునకున్। శరణాగతమరుకేరళ। కురుభూపాలున
కుజగనగోపాలునకున్॥ క॥ అంభోధివలయితావని। సంభరణప్రౌఢనిజభుజా
ర్గళయుగళీ। సంభావితకిటికచ్ఛప। కుంభీనససార్వభౌమకులకంధరునకున్॥ క॥ వే
మాధిపానుజునకును। రామామదనునకుఘోడరాయగురుశ్రీ। భీమేశ్వరశం
ష్యునకు। స్వేమాంబాగర్భసలిలనిధిచంద్రునకున్॥ క॥ త్రైలోక్యవిజయసా
ధవి। శాలమహాచంద్రచంద్రశాలాసతత। వ్యాలోకితగాత్రమక। న్యాలహరీవి
రహతాండవాటోపునకున్॥ క॥ అసితల్లివల్లభునకున్। గవకాద్రివినిద్రకల్పక
ద్రుమలీలా। వనభవనకిన్నరస్త్రీ। జనతాజేగీయమానచారిత్రునకున్॥ క॥ ని
ర్ఘృణనిర్ఘాతస్ఫుట। నిర్ఘోషకఠోరధాటినిస్సాణమహా। దీర్ఘతరఘణఘణాంకృ
తిఘూర్ణితనిర్దళిత చతుర్దిక్కునకున్॥ క॥ హాటకకుంభద్ధనుర్ధర। జూటీ
కోటీకుటీంసుమనస్తటిని। వ్యాటికితోర్మిసంఘా। ఘాటవచోవైఖరీజితద్రు
హిణునకున్॥ క॥ గజదళవిభాళబిరుదున। కజగవధరభక్తిభావితాత్మునకు సమి।
ద్విజయునకు రాయవేశ్యా। భుజంగునకును వీరభద్రభూపాలునకున్॥ వ॥ అభ్యు
దయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కాశీఖండంబు॥ *॥ సీ॥ పద్మాది
కంబులుఁ పదియు నెనిమిదియునాదిపురాణంబులాపురాణ। జాతంబు నాల్గులక్షల
సంఖ్యగలయదియును బురాణంబులందుద్భవించెఁ। బదునొకండ వదియై బ
హుసంహితలతోడ బహుఖండములతోడ బహువిచిత్ర। కథలతో నేకలక్షగ్రం
థపరిమాణకలితమై శ్రీమహాస్కాందమొప్పు। నమ్మహాస్కాందమునకు నా
రాశిమనఁగ। నాల్గుపురుషార్థములకుఁ దానకమనంగ। బ్రహ్మవిద్యకు నాది
కారణమనంగ। నఖిలఖండంబులందుఁ బ్రఖ్యాతివడసి॥ గీ॥ మూఁడులక్షలుఁ
బదియేడు మొనసిపోవఁ। దాఁ బ్రబలిల్లులక్షగ్రంథములతోడ। సమధికస్ఫూ
ర్తి నేపురాణములుసాటి। గరిమకందంబునకు మహాస్కాందమునకు॥ గీ॥ పదు
స నెనిమిదియన్య దేవతలఁజెప్పుఁ। బదిపురాణంబులీశ్వరుఁ బ్రస్తుతించుఁ। జంద్ర
మౌళిప్రభావంబు సమధికముగ। శ్రుతులయట్లపురాణ సంహితలు నొడువు॥
గీ॥ సరవిసర్గంబునాఁ బ్రతిసర్గమనఁగ। వరుసతో వంశవంశానుచరితములనఁ।
గ్రమపరిప్రాప్తిమన్వంతరములనంగ। లలిఁబురాణంబునకు నైదులక్షణములు॥
గీ॥ గ్రంథపరిసంఖ్య నాల్గులక్షలు పురాణ। మది చతుర్దశవిద్యలయందుఁ జె

ద్ది। సాగుణ్యశబ్దార్థసంపాదానుషంగికమయి। యనాదికాలికమందు బ్రహ్మార్థగతి
ము॥ ఉ॥ అట్టిదివ్యపురాణముమహాత్త్వము సూతుండు దద్విదుండుగా। నట్టిక
నిర్గజన్మమునఁ బ్రఖ్యాతుఁడయ్యె నురుప్రభావులై। నట్టిమహామునీంద్రులకు
సంబుధిసంభవుసంతతవారికిన్। దిట్టతనంబు మీఱ నుపదేశము సేయుచునుండు
బ్రహ్మాముల్॥ సీ॥ ఆదిమనోమయంబగు నొక్క చక్రంబుఁ గల్పించె బ్రహ్మజగద్ధి
తముగ। గల్పించి యాబండికలు దోలె సత్యలోకంబుననుండి యనేకములగ
ద్యఁ। జదిసొల్లిగిరివిస్తృతాంతరంబులు దాఁటి క్రమముతో భూమిచక్రమున వ్రా
లె వ్రాలి రంహాస్ఫూర్తి వచ్చి వచ్చి ధరిత్రి నిమ్నోన్నతులశీర్ణనేమియయ్యె।
నేమివిరిసిన కతనన న్నేల నెలవు। నైమిశంబయ్యె వది యట నైమిశంబు। దన్మ
హాపుణ్యవనమున ద్వాదశాబ్ద। సత్రయాగంబు గావించె శౌనకుండు॥ వ॥ ఆసత్ర
యాగంబునందు శౌనకాదిమహామునులును స్తుత్యర్హసంభవుండైన సూతు న
ర్చించి తన్ముఖంబునం బురాణేతిహాససంహితలు వినిరి గావున నిమ్మహావిద్యా
స్థానంబు సూతమునిసంవాదాత్మకంబు॥ గీ॥ స్కాందమునయందు నేఁబదిఖం
డములకు। బహుళకథాసంగతులు సేయ బాగుగాదు। ఖండఖండంబులందును
గలిగినట్టి। కథలపాలివి సంగతిగ్రహణమునకు॥ వ॥ ఇమ్మహాస్కాందమ్మునకు
నవయనంబులా ఱుసంహితల విక్రమంబున సనత్కుమారసంహిత పంచపం
చాశత్సహస్రిక సూతసంహిత షట్సహస్రిక శాంకరసంహిత త్రింశత్సహస్రిక వై
ష్ణవసంహిత పంచసహస్రిక బ్రహ్మసంహిత త్రిసహస్రిక। సౌరసంహిత యేకసహ
స్రిక యీసంహితలయందుఁ బంచనాగరఖండంబు గమలాలయఖండంబు రే
వాఖండంబు నేకవీరాఖండంబు మైలారఖండంబు గోదావరీఖండంబు లివియా
దిగాఁగలయవి పంచాశత్ఖండంబులందు॥ ఉ॥ ప్రాశస్త్యంబు వహించు ద్వాద
శసహస్రగ్రంథసంక్లుప్తివి। శ్వేశక్షేత్రవిధాన్నదీపటుకదుంభీశాదిసత్కీర్తనో।
ద్దేశప్రక్రమశోభితాద్భుతకథాధిష్ఠానమై శ్రేష్ఠమై। కాశీఖండమఖండవైభవ
మునన్ స్కాందాబ్ధిమధ్యంబునన్॥ వ॥ ఈకాశీఖండంబు వేదవ్యాససూతసంవా
దాత్మకంబనియునుం గ్రొందఱు చెప్పుదురు దీనికిం గథాక్రమణిక వింధ్యనారద
సంవాదంబు బ్రహ్మలోకప్రభావంబు గోదానమాహాత్మ్యంబు వారణాశియం
దగస్త్యాశ్రమవర్ణనంబు మునిదేవతాసమాగమంబు పతివ్రతాచరిత్రంబు కుం
భసంభవప్రార్థనంబు తీర్థప్రశంస శివశర్మోపాఖ్యానంబు సప్తపురీప్రశంస
సంయమనీస్వరూపంబు మహేంద్రలోకదర్శనంబు వహ్నిసముత్పత్తి క్రవ్యా
ద్వరుణసంభవంబు గంధవత్యలకావర్ణనంబు చంద్రలోకప్రాప్తి యుడులో
కవృత్తాంతంబు శుక్రసముద్భవంబు శనైశ్చరలోకవర్ణనంబు సప్తర్షిలోక

ధ్రువలోకవర్ణనంబులు కుమారాగస్త్యసంవాదంబు మణికర్ణికోపసముద్భవంబు గంగామాహాత్మ్యంబు భైరవావిర్భావంబు దండపాణిజన్మంబు కళావత్యుపాఖ్యానంబు సదాచారంబు బ్రహ్మచారిప్రకరణంబు స్త్రీలక్షణంబు కృత్యాకృత్యప్రకరణంబు గృహస్థధర్మంబు యోగనిరూపణంబు కాలజ్ఞానంబు దివోదాసవర్ణనంబు యోగినీవర్ణనంబు లోలార్కోత్తరార్క సాంబాదిత్యద్రుపదాదిత్యారుణాదిత్య వర్ణనంబులు దశాశ్వమేధతీర్థ మాహాత్మ్యంబు పిశాచమోచనంబు గణేశ్వరప్రేషణంబు గణేశ్వర మాయాప్రపంచంబు డుంఠిప్రాదుర్భావంబు విష్ణుమాయాప్రపంచంబు దివోదాసముచ్చాటనంబు పంచనదోత్పత్తి బిందుమాధవ సంభవంబు వైష్ణవతీర్థ మాహాత్మ్యంబు మందరాచలంబుననుండియిందుమౌళికాశికాపురంబునకేతెంచుట జైగిషవ్యోపాఖ్యానంబు కృత్తికావాసనముత్పత్తి దుర్గామాహాత్మ్యంబు ఓంకారమాహాత్మ్యంబు త్రిలోచనసముద్భవంబు కేదారకేశవర్మేశమాహాత్మ్యంబులు పక్షికథ విశ్వభుజాఖ్యానంబు దుర్దమకథవీరేశ్వరాఖ్యానంబు కామేశ్వరవిశ్వకర్మేశ్వర సతీశ్వరామృతేశ్వరవర్ణనంబులువ్యాసభుజాస్తంభంబు క్షేత్రతీర్థకదంబవర్ణనంబుముక్తిమంటపవర్ణనంబువిశ్వేశావిర్భావంబు దేవతాయాత్రావిధానంబుననఁబన్న్యాఖ్యానంబు లేకోత్తర శతంబునుంగలిగి॥ శా॥ ఆశాస్యంబులుసంఘటించును బహూపాఖ్యానశాఖోపశా। ఖాశోభాసముదంచితాభ్యుదయమైస్కాందాబ్ధిసంజాతమై। యీశానుగ్రహలబ్ధముక్తిఫలమైయెక్కాలముం గోరికల్ । గాశీఖండమఖండవైభవమునం గల్పద్రుమప్రక్రియం॥ వ॥ పూర్వఖండంబునబ్రహ్మర్షి నారదుండు తీర్థయాత్ర చరించెననిసూతుండు శౌనకాది మహామునులకుం జెప్పివారడుగం గాశీవృత్తాంతంబిట్లని చెప్పందొడంగెఁగృష్ణద్వైపాయనుండు ప్రియశిష్యుండైనసూతునకనంతరకథాక్రమంబునం గాశీఖండకథాకథనప్రారంభంబున నిట్లనియె॥ గీ॥ ఇవ్విధంబున దీర్థంబు లెల్లనాడి। నర్మదానదినవగాహనంబొనర్చి। దలఁచిగోదావరీసింధుతటముపట్టి। దండకానసవీధిమధ్యంబుదరిసి॥ ముందట॥ శా॥ కాంచెం గాంచనగర్భసంభవుఁడుదగ్రగ్రావకోటిస్థల । చ్చంచన్నిర్ఝర వేణికానివహసంజాతాబ్జసౌగంధ్యముం । బంచాస్యస్ఫుటకంఠ నాద హతకుంభ త్కుంభిగర్వాంధ్యముం।న్యంచద్ధాటకభూమిభృచ్ఛిఖరగర్వావంధ్యముం వింధ్యముం॥ క॥ రేవాతరంగశీకర। సేవాహేవాకపాకశిశిరమరుత్ప్రో। స్తావపరికంప్యమానజ। టావలియనుసతఁడువింధ్యమల్లనచేరెం॥ క॥ తాపసకులాగ్రగణ్యా । శ్రీపాదాంభోజయుగళచిహ్నాశ్రేణీ। నైపథ్యపదముపుణ్యాళి । లాపట్టంబయినయ

య్యేలాధర మెుప్పఁగ॥ సీ॥ త్రసరేణుపరిమాణధాతుధూళీపాళి యలకంబుల
కవింత చెలువునొసఁగ। ఘనమైన రారాపుచను దోయి రాయిడి నిఱుపేదనడిమి
కి వెఱపుచూపఁ। దొలుకాఱుమెఱుఁగుఁదీఁగల నేలు కన్నులు వడదాఁకియొ
క్కుంతవాడఁబాఱ। సింధూరతిలకంబు చెమటచిత్తడిదాఁకియలికభాగంబున
దసలుకొనఁగ। గనక మేఖలజఘనచక్రమునఁజాఱ నీవిబంధము నాభిపై నెమ్మ
వదల। మహతిధరియించి యొక తనుమధ్య దన్ను। ననుసరించుచు గాంధర్వమ
భ్యసింప॥ సీ॥ కర్పూరకదళికాకాంతారపవనంబు లధ్వనీనుల శ్రాంతి వవన
యింప। మదురంగఁబండినమాలూరఫలములు చెంచుకన్యలకుచ శ్రీలఁజెన
యు। నురగవల్లీగాఢపరిరంభణంబులఁబోఁక మ్రాఁకులఁ గెంపుపొదలుకొనఁగ।
బాటలీవకుళచంపక సౌరభముతోడ నేచికిలా మోదంబు వియ్యమందఁ। గమి
యనామ్రాలచూడంబుగా ఫలించి। యంబరము మోచియున్న యుదుంబరము
లు। తీలబ్రహ్మాండభాండమాలికల భూమ। లవధరించిన వృషభాంకు ననుకరించె॥
క॥ దరవికచవకుళకురువక। పరిమళసంభారలోల బంభరమాలా। పరిమ
ళ్ఝుంకారధ్వని। తెరువరుల కుమన్మథప్రదీపన మెుసఁగున్॥ వ॥ వెండియుఁ గర్క
శేటుకఠోర తార రటనంబును దాత్యూహపుత్యూహకుహూకుహూరావ కోలాహ
లంబునుం గలకంఠకంఠకోమల కుహూకారంబును మదకలకలవింకచుంకృతి
కారకాకలీకలకలంబును బుంఖానుపుంఖఝిల్లీ ఝుంకార ధారాప్రసారంబును
సముద్ధతధ్వాంక్ష నిధ్వానపాట వాటోపంబును సముత్కటోత్క్రోశ వాసిత
వ్యాపకక్రోశసంరంభ సంభ్రమంబును కోయష్టివదననిష్ఠ్యూత నిష్ఠురారావనిష్ఠా
సౌష్ఠవంబునుం గూడి కిటిశరభగండ వేదండశార్దూలసింహగవయసృమరచమ
రవాతప్రమిహాలులాయఖడ్గకురంగ భల్లూక ఫేరవగోలాంగూలాది నానామృ
గంబుల మెలుంగులతోడఁగీల్బెరసిల తాకుడుంగగర్భంబుల ప్రతిశబ్దంబులావి
ర్భవింపం జేయఁగి సలయముకుళకుసుమశలాటుఫలభరితంబై బిసరుహబాంధ
వుని కిరణవిసరంబులను సుంగనిమసమసకనైపెయిరులసల్పికొనుచు నిసుకచల్లి
నరాలనిపసరుడాలు వింధ్యవసుంధరాధర ప్రాంతకాంతారంబు దరసిచనువాఁడు
ముందట॥ మ॥ నలినప్రోద్భవసూతి గన్గొనియె వింధ్యక్షోణిభృత్కంధరాబల
వద్దండశిలాభిఘాత విలుఠత్త్వావిధస్తరంగచ్ఛటా। స్ఖలనారంభ విజృంభమాణ
పటుఝుంకారస్ఫుటాంతర్నర్మదన్। గలనాత్తత్పురభర్తలోకపరిరక్షాశర్మదన్ న
ర్మదన్॥ గీ॥ దివిజముని నర్మదావదిఁదీర్థమాడి। విమలభస్మంబు నిఖిలాంగక
ములనలఁది। యుఱుతరుద్రాక్షమాల్యంబులను వుపతిచి। భవునినోంకారనా
థుని బ్రస్తుతించి॥ అప్పుడు॥ గీ॥ స్థావరంబై సరూపంబు జలదవీధి। నాదరించు

చు మొదలనున్నట్లయుండ। జంగమంబైనరూపంబు చనధరించి। యెదురుగా
వచ్చె వింధ్యమహీధరంబు॥ గీ॥ అతిథిగ మునల్పుఁడైన నునధికుఁడైన। నింటికేతె
రఁ బ్రియమందు సెవ్వఁడేని। వానిగౌరవము నగౌరవంబుగాని। కాదుగౌరవమా
కారగౌరవంబు॥ సీ॥ మొగులుముట్టిన మహామూర్ధంబు ధరమోవఁ బాదాం
బుజములకుఁ బ్రణుతిఁ జేసి। యంతరంగముకంటె నత్యున్నతంబైన పృథుహేమ
పీఠంబు వెట్టఁబంచి। దధ్యాజ్యమధుపుష్పదర్భాదికములైనయష్టాంగములతో
డియర్ఘ్యమిచ్చి। యాత్రాసముద్భూతాయాసఖేదము వాయ నంఘ్రిసంవాహనం
బాచరించి। శ్రాంతిదీరుట మౌనిఁ గేహస్తములు మొగిచి। వినయవినమితగా
త్రుఁడై విన్నవించి। తనగుహారంధ్రములు ప్రతిధ్వనులనీన। వేల్పుఁదపసికినిట్ల
నెవింధ్యశిఖరి॥ వ॥ మహానుభావా భవదీయకృపాకటాక్షవీక్షాసుధాసంప్ర
వాహంబునరిత్తప్రపరంబును ద్వదంఘ్రినఖచంద్రమండలజ్యోత్స్నాసమున్మే
షణంబున దమఃకాండంబును ఖండింపంబడియె నింతగాలంబునకుఁ బ్రాగ్జన్మ
కృతంబులైన సుకృతంబులు ఫలించె విశ్వంభరాభారభరణదీక్షాదురంధరం
బులగు నాకులంబు వసుంధరాధరంబులలో సమాన్యుండనైతి ధన్యుండఁ గృతా
ర్థుండ భాగ్యవంతుండనదియట్లుండె యుష్మత్పాదారవిందసందర్శనంబున బ్ర
భవించిన యానందప్రవాహంబుల్లంబున వెల్లివిరిసిన కతంబున నేయర్థంబునకును
నవకాశంబులేదైనను నొక్కవిన్నపంబు సావధానమతివై యవధరింపుమిదిసీకు
సేవాంజలీపుటంబు పంచాశత్కోటివిస్తీర్ణంబైన భూమండలంబునందు నీ
చూచినయట్టి మహీధరంబులు లేవకొండలు లెక్కకుఁ బెక్కుగలుగుంగాకేమి
దిక్కుంజరంబులకు దిక్కై కూర్మంబునకు నర్మిలియై క్రీడాక్రోడంబునకుఁ దో
డై ఫణపతేనికిం బ్రాపై యేచుభోలె నెక్కటిమ్రోయు సర్వసర్వంసహాచక్రంబును భ
రియింపంగలయది యేమందరంబు మందరశ్మిసిలంబు నిలనిలయంబ స్తంబ స్తవ్య
స్తంబుదయంబనభ్యుదయంబు క్రౌంచంబకించనంబు గంధమాదనంబు పేదవా
రియాత్రంజేత వ్యాత్రంబు మలయదర్దురత్రికూటంబు లొకపాటివి మహేంద్రవి
షధద్రోణంబులుదరిద్రాణంబులు హేమకూటంబు గిటగిటనందక్కుచిలుగొం
డలఁబెక్కునంగారణం బేమి యుష్మదీప్పాటనాతోడం బ్రతిభటింపంగలయది
సురగరుడఖచర విద్యాధరయక్షకిన్నరగంధర్వదర్వీకరాశ్రయంబును గల్పత
ర్వాదికానునకామధుక్సనుమండలంబును విబుధవేదండశుండాదండ చుళికి
తోద్గీర్ణస్వర్ణదిక్కాండగండూషితబ్రహ్మాండగోళంబును నగు సుమేరుశై
లంబు మాయిద్దఱ తారతమ్యంబును నెఱుంగుదు నాకునగ్గిరికి నిప్పుడు గొన్నివా
సరంబులనుండి యీరసంబు వెరుగంగ అకటి నెట్టుకొని సాగుచున్నదియింకనై

ట్టుండు భట్టారకా మోహంబుడిగి పక్షపాతంబు పరిత్యజించి యానతిమ్ము॥ గీ॥ అనియవష్టంభసంరంభమతిశయిల్లఁ। బలుకుటయునాత్మఁగపించించి నలువ పట్టి రెయిందునాకరయొక్కంత సేపూరకుండి। యుస్సురనుచును వేఁడినిట్టులార్పు వుచ్చె॥ వ॥ పదంపడి నిలింపమౌని కలహప్రియుండుగావునఁ ద్రిభువనోపద్రవ కారణంబైనను నమ్మహామహీధరసంఘర్షణంబునకు సమ్మతించి శక్తిసంధుక్షణార్థంబు వింధ్యంబున కిట్లనియె॥ శా॥ నాతో నీవిపుడిట్టులాడితి ప్రధానత్వంబపేక్షించి ప్ర। స్ఫీతాటోపమహాప్రతాపగుణగంభీరార్థ యుక్తంబుగా। నాతో నిట్లనియాడె మేరువు ప్రధానత్వంబపేక్షించి ప్ర। స్ఫీతాటోప మహాప్రతాపగుణగంభీరార్థయుక్తంబుగన్॥ గీ॥ నీవెఱుంగుదు నీలావు నిక్కువముగ। నెఱుఁగుదన లావు తానమ్మహీధరంబు। తప్పకుండమీయిద్దఱ తారతమ్య। మెంతవారును దెలియంగ నేరుతురు॥ వ॥ శ్రీశైల వేంకటాహోబిల శోణాద్రి సాలగ్రామాదిపర్వతంబులు మహానుభావంబున మీయిద్దఱకంటెనధికంబులు మీగర్వాలాపంబులు విని యోర్వవచ్చునే మిమ్మునేమనవచ్చు హెచ్చుకుందాడ నేరకేవిషాదంబునే నిట్టూర్పునిగుడించితి మముఁబోటి తీర్థయాత్రాపారీణులకుని దియేటిచింత మీకు మేలయ్యెడుం బోయివచ్చెదననినారదుండందేనియుంజని యెదదనంతరంబు॥ గీ॥ విబుధమునిమాట చెవిసోఁక గ్రొవ్వేఁడిగాన। వింధ్యగర్వదయుండై నవింధ్యశిఖరి। చాలనుద్వేగము దవిచారపంత। నాత్మఁగతమున దానునిట్లనుచునుండె॥ గీ॥ శాస్త్రమాచార్యసన్నిధిఁజదువఁడేని। నిద్ధబోధంబుమదినంగీకరింపఁడేని। తెగువమీఱ ప్రతిజ్ఞ సాధింపఁడేని। జ్ఞాతిజయముసందఁడేని ప్రజ్ఞుఁ డుజనుఁడె॥ ఉ॥ కంటికినిద్రవచ్చునె సుఖంబగునే రతికేళిజిహ్వకుఁ। వంటకమిందునే యితరవైభవముల్ పదివేలు మానసం। బంటునె మానసంబుగలయట్టి మనుష్యునకెట్టివానికిన్। గంటకుఁడైనశాత్రవుఁడొకండుదనంతటివాఁడుగల్గఁగన్॥ క॥ ఎవ్వనితో నెచ్చోటం। జివ్వకుఁ జేఁజాఁపవలదు చేఁజాఁచినచో। నివ్వలనవ్వలనెవ్వరు। నవ్వక యుండంగఁ బగసనందీర్పఁదగున్॥ శా॥ ఆచందంబుననంతరంగమునకత్యంతంబు తీవ్రవ్యథా। ప్రాచుర్యంబుఘటింపఁజాలదతిఘోరంబైనదావానలం। బేచందంబుననంతరంగమున కిట్లజ్ఞాతిభూభృజ్జగీ। షాచింతాభరమావహించునతిదుస్సాధవ్యథాభారముల్॥ సీ॥ భేషజంబద్దాని భేదింపఁజాలదు లంఘనంబున నెద్దిలావుచెడదు। లెత్తిగించుబుద్ధిని ద్రామహోత్సాహతుద్ధాకార తేజోబలాది నెద్ది। నపత్యచరకధన్వంతరిప్రభృతి వైద్యులకునసాధ్యమైయుండు నెద్ది। దివసంబులాతడంతి క్రమించినయప్పుఁజీర్ణత్వదశనధిష్ఠింపదెద్ది। ప్రత్యహంబునపత్వంబువడయు నెద్ది। యుట్టిచిం

శాజ్వరంబునన్నలమికొనియె। నేమిసేయుదునింక నే నెచటఁజొత్తు। నెట్టునిర్జిం
తుమేరుమహీధరంబు॥ క॥ ఉప్పరమెగసియజాండము। చిప్పులురాలంగ మే
రుశిఖరంబులపైఁ। గుప్పించిదాఁటుకొందునొ। తప్పకనామనసులోనితహత
హాదీర్ప॥ ఉ॥ ఒక్కఁడుమూఁకలంబునసముద్ధతిఁజూపి సజాతరోషుఁడై। తె
క్కలుదెంచివేలుపులతేఁడటుపాపముచేసెఁగాకయా। తెక్కలునేఁడుగల్గిన
నెకింగిజవంబునఁబొకుతెంచిబి। ట్టెక్కనెకూటకోటితటులెల్లనునుగ్గులుగా
గమేసువ్రు॥ గీ॥ అడుసులోపలఁదాటిపండదిమినట్టు। లదుముదు నెకానిపా
తాళమంటికొనఁగ। వేల్పులెల్లనువిభ్రాంతివిహ్వలింపఁ। బాదములమెట్టినా
బాయఁబసెఁడికొండ॥ శా॥ ఈమైశ్వర్యము చూడఁజాలుదు నె. నేనిప్పాటనా
నాఁటికి। నేఁయిందుగ్రహతారకంబులుపగల్ నీ రేరుహోప్పుందు నే। వాయోగం
బు మెయిన్ బ్రదక్షిణముగా వర్తిల్లఁగానిర్భరా। సూయామానపరీతచేతసు
డనై శూనోద్యమప్రక్రియన్॥ గీ॥ అడ్డపెట్టెదఁగాక తీవ్రాంశురథము। ప్రహ
రిదిరుగకయుండంగ భర్మగిరికిఁ। దరతరంబీయజాండకర్పరముదాఁక। ఘనశి
రశ్శృంగశృంగాటకములు వెంచి॥ వ॥ అనియవష్టంభసంరంభంబున॥ మ॥ అ
వరోధించెను వింధ్యభూధరము బ్రధ్నాశ్వంబుదర్పోద్ధుర। వ్యవసాయోద్భట
శాద్రిభంగినురులింగాకారుఁడై యీశ్వరుం। డవరోధించినగర్వలేఖబలి దైత్య
ధ్వంసినారాయణుం। డవరోధించిన దేవమూర్ధము మొగి నూర్ధ్వాండంబుతోరా
యఁగన్॥ గీ॥ మేదినీధరమిబ్భంగిమిన్నుముట్టి। నిట్టనిలుచుండిచూచెనిర్నిమి
షదృష్టిఁ। దనయనుష్ఠానకాలంబుదప్పకుండు। బ్రాహ్మణుఁడు జపకడఁబోలె
భానుపొడుపు। అంత॥ సీ॥ చిఱుసోనఁబట్టించి చికిలిసేయించిన గండ్రగొడ్డలి
నిశాగహనలతకుఁ। గాఱుక్కన్నని బిడాంధకారధారాచ్ఛటా సత్రవాటికిఁపీతి
హోత్రజిహ్వ। నక్షత్రకుముదకాననముగిల్లెడుబోఁటి ప్రాచినెత్తినహస్తప
ల్లవాగ్ర। మరసిమింటికిమంటికైక్యసందేహంబుపరిహరింపఁగఁబొల్పడ్డయువ
ధి। సృష్టికట్టెఱతోలుసంజచెలిమికాఁడు। కుంటుపినతామహాదేవికొడుకుగు
ఱ్ఱ। సవితృసారథికట్టెఱచాయఁదెలుప। నరుణుఁడుదయించెఁ బ్రాగ్దిశాభ్యం
తరమున॥ సీ॥ ప్రాలేయకిరణబింబంబువెల్వెలఁబారి యస్తాచలంబుపైనత్తె
మిల్ల। పరుసతోనోషధీవల్లిమతల్లులు కాంతివైభలక్ష్మికచ్చువదల। రవికాంత
పాషాణరత్నంబులంఇబ్బియగ్ని ప్రత్యుద్గానమాచరింపఁ। ప్రబలాంధకార
దారాచ్ఛటాపటలంబుపంచబంగాళమైపారిపోవ। నుదయపర్వతకటకగండో
పలముల। పక్షమూలచ్ఛిద్రాగ్రణప్రీభనమైన। నెత్తురనిమెడువిచికిత్సనివ్వటి
ల్ల। భానుకిరణంబులొకకొన్ని పాఁకెనభము॥ సీ॥ తఱపి వెన్నలలోసిధావళ్య

మొకకొంత నవసుధాకర్దమద్రవముగాఁగ। జిన్నారిపొన్నారిచిఱుతచీఁకటి
చాయ నసలుకొల్పినమసీరసముగాఁగ। నిద్రమేల్కాంచిననేత్రమ్ము మొగడ
లపరువంపుపుష్పౌఘవారిదళముగఁ। దొగఱువన్నియ లేఁతతొలుసంజ కెంజా
యుశమసీయధాతురాగంబు గాఁగ। వర్ణములుగూడియామినీవ్యపగమమున।
జగముచిత్రింపఁదూలికచందమైనఁ। గొమరుఁబ్రాయంపునూనూఁగుఁగొద
మయొండ। ప్రాచికభినవమాణిక్యపదకమయ్యె॥ గీ॥ ప్రాగ్దిశాకాంతనిండుగర్భం
బునందు। సూర్యుఁడుదయింపఁబ్రొద్దులుచొచ్చియుండ। మొదలఁదీంద్రించు
లేఁతక్రొమ్మొల్మలకయొండ। నింగియింగిలికాసనభ్యంగమార్చె॥ చ॥ కమలము
లుల్లసిల్లరవికాంతశిలాధమసీలతానహా। ప్రసములఁగృపీటసంభవుఁడురాజఁగఁ
జీఁకటియూరుసొరుగాఁ। గుముదమునిద్రవోఁబొడఫుఁగొండపయిఁ రవియొ
ప్పెఁజూడఁగా। సమధికలీలనింద్రమనిహాజారవుమేడకుఁబైఁడికుండమై॥ సీ॥ చర
మరింఖాపుటాంచలటంకశిఖరంబులుదయాద్రిచత్రీఁ జాఱకుండ పాపి। తీఁగ
సాఁగినభంగిదీర్ఘదీర్ఘములైనయంగకమ్ములవాజులలమియెత్తి। సుత్తానుఁడై
వెన్కకొరిగిపిచ్చుకకుంటువిప్రతీపంబుగావినుతిసేయ। నపగతవ్యాసంగమగు
టఁజిత్కారంబు వెలిగాఁగఁజక్రంబువిభ్రమింప। నధ్రిపిఁకిలంఘించె నాహా
వాది। గంధవాహ ప్రవాహాభిఘట్టనమునఁ। గేతనముమీఁదిపఃకింకిణులు
మొరయ। మెఱపుమెఱసినచందానమిహిరురథము॥ సీ॥ దోర్దండఘట్టనత్రుటిత
గ్రహాగ్రాహధూళిపాళీమిళద్వ్యస్థలములు। ధ్వజపటీపల్లవోద్ధతమరుత్సంపాత
పరికంపమానోడుపరివృఢములు। గ్రాసాభిలాషానుగతవిధుంతుదవునఃప్రావృత్త
చక్రవ్యథోపద్రవములు। శ్రాంతాశ్వనిబిడనిశ్వాసధారాధుతస్వర్ధునీనిర్ఘర
జలచరములు। గగనపదలంఘునైకజాంఘాలికములు। పద్మవనబాంధవుసిరథప్ర
స్థితములు। సాఁగెనదిదక్షిణాయనసమయమగుట। దర్దురముమీఁదమలయభూ
ధరముమీఁద॥ గీ॥ నడచెఁ ముండీర దేశంబునశిమిచాయ। గగనఘంటాపథంబు
నఁగమలహితుఁడు। పాండ్యభూపాలశుద్ధాంత భవనహేమ। దీర్ఘికలయందుఁ
దననీడ జేజరిల్ల॥ సీ॥ ఒకదీవి కేక్కొండయుదయాద్రియైయుండు నదియొండుదీవి
కిన స్తశిఖరి। యొకదీవిఁదొలుసంజయు నేమ్మమునఁబొందు నుదయించుచునుఱు
సంజయొండుదీవి। నొకదీవినిండుఁజంద్రికలుమిన్నులుప్రాఁకునొకదీవికేయొండ
యుబ్బికాయు। నొకదీవిశవణీలునొకఋతుప్రారంభ మొకదీవినిఁగఁరోత్తునొం
డుఋతువు। దక్షిణాయన మొకదీవిఁదమకుఁజూపు। నుత్తరాయణ మొకదీవి
నుప్పతిల్లు। నిన్నిటికియుత్పత్తిభావంబు హేతుభూత। మట్టిరపిఠేరుసాగెలంకాద్రి
మీఁద॥ సీ॥ మలయాచలంబుపైఁజిలువయిల్లాండ్రులఫణరత్నములయందుఁ

ప్రతిఫలించి। లంకాపురంబున శాంకరీదేవతమకుటేందు రేఖతో మచ్చరించి।
కాంచీపురోపాంతకంపాతరంగిణీనాళికావన రాజిమేలుకనిపి । ద్రవిళసీమంతినీ
స్తనమండలంబులనవకంపు చెమరుబిందువులనిలిపి। సహ్యగిరిరాజకన్యకాజల
నిధాన। సలిలలహరీపరస్పరాస్ఫాలనోద్ధ।కణలవాసారసీహారగంధవాహ।సంగ
మంబులఁబథిపరిశ్రాంతిఁదొలఁగి॥ వ॥ ఇవ్విధంబునదక్షిణాపథంబునం జనున
ప్పుడు॥ సీ॥ విస్ఫురకధ్వాంతౌఘవిధ్వంసనక్రియా పరమదీక్షారంభగురుమ
యూఖ। దశశతపరిమదధారమండలుఁడైనచండభానునికధిష్ఠానమగుట।భా
రంబుభరియింపఁబకువ్వపడ్డదివోలె మూపుమూపుననుండి మొక్కలమున।సని
లంబు లేకునునం చెలంచెలుగట్టియాకాశవీథినందందనడవ। నడచుదవి తేరుమిం
టినన్నడిమిదక్కి। బ్రగ్గనఁగఁదాకె వింధ్యపర్వతముచటుల। కఠినదిగ్ఘోషనిర్ఘా
తఘట్టనమునఁ। బంకజాతభవాండకర్పరమువగుల॥ క॥ తగులువడియప్పుడున
డిచెడి। గగనమణిరథంబు దోరగలువడినిలిచెఁ। బొగరుమొగగడలియక్క
లిఁ। దగిలినిలువఁబడినఘనవితతియుంబోలెఁ॥ క॥ ఒక్కనిమేషము రాహువు।
పుక్కిటిలోఁదగులువడకపోయెడుభానుం। డిక్కొండ ప్రక్కఁజిక్కెం। బక్క
డులువిధివశంబు పెంపెట్టిదియో॥ గీ॥ రెండువేలునునిన్నూటరెండుయోజ।
నంబులర్ధనిమేషమాత్రంబునందు। నంబరంబునఁబారుతీవ్రాంశురథము।నిలిచె
బహుకాలమిట్టిదెనియతిమహిమ॥ క॥ స్థితిసర్గవిసర్గములను । గతిభానుఁ
డుగేవలంబకానఁదదీయ। ప్రతిబంధముదైత్రైలోక్య। ప్రతిబంధంబైవిపత్పరం
పరదనర్చె॥ సీ॥ లేవయ్యెస్వాహాస్వధావషట్కారంబులుడివోయెఁత్రేతాగ్ని
హోత్రవిధులు।కాలంబుకొలఁదిలెక్కలువెట్టనేరకచిత్రగుప్తాదులుచిక్కు
వడిరి। యిదిసంజయిదిరాత్రియిదివాసరంబను సమయవర్ణము లపక్రమముల
య్యె। స్రావితోవర్షంబుసమకూఱకుండుటపంటలేబరమయ్యెఁబాడితోడఁ।
గొన్నిదేశంబులెండచేగొపరిపోయెఁ।గొన్నిదేశంబులిమముచేఁగొంకువోయె।
గొన్నిదేశంబులిరులచేగుత్తిపడియెఁ। గొన్నిదేశంబులివచేతఁగూడఁబడియె॥
సీ॥ పూచినకొఁవిపూఁబోదరింటిచందానఁ గత్తెరయొక్కచోఁగదలకుండె।
నొకచోఁదగుల్పడియుపకారికోఁటికిదరమైనరోహిణీతారకంబు। లొకచో
బునర్వసుపూఁగివృక్షముకొమ్మనుడివడ్డముత్యాలసోగువోలె। శయునిఁచెనొ
కచోట శ్రవణనక్షత్రంబుగుంటివిడాఁదటఁబ్రత్తికోడుకువోలె। స్వాతిచిత్తలు
తోరణస్తంభయుగము। ననుకరించుచునొక్కచోనత్తమిల్లెఁ। బిఱుతవోయి
నచూఁకుఁకిచెలువుదాల్చి। హత్తెనొకచోవిశాఖవింధ్యాద్రియందు॥ సీ॥ నేత్రం
బులు స్నేహనిస్పృహత్వమునొందఁ బ్రతిపుటంబులశక్తిచొక్కమగుడ। ఘూ

జేంద్రియజ్ఞానకళయూరుపోరుగా జిహ్వావివేకంబు దిఁబుత నోప। సంతరంగమున మోహాంధకారము గ్రమ్మఁ దన్ను వుచేష్టా దరిద్రత వహింప। ప్రాణముల్ శ్వాసమాత్రముగఁ బర్యవసింపఁ దలచీర యెఱుఁగనిదశఘటిల్ల। చాముగ అచిన మూర్ఛిల్లి పడిన యట్లు। పడిరి పాశ్చాత్యదేశంబు పంచజనులు। తరణిదీధితి లేమి జైతన్యమెడలి। వితతనిద్రాసమావేశవిహతులగుచు॥ వ॥ అనినవిని నైమిశారణ్యమునీశ్వరులటమీఁది వృత్తాంతం బెయ్యదియని యడిగిన॥ శా॥ పారావారపరీతవిశ్వవసుధాభారోద్ధతిప్రక్రియా। ఘోరంధర్యసరోరుహేక్షణ సమిద్ధాండీవకోదండదా। త్రాఁ రామప్రమదాకఠోరకుచకుంభాభోగసంక్లృప్తక। స్ఫారిస్థానకముద్రితస్థగితవక్షోవీధికాభ్యంతరా॥ క॥ వేమాంబా ప్రియనందన। హేమాచలధీరభువనహితచారిత్రా। వేమాధిపానుసంభవ। రామారతిరాజరాజరాజకిరీటా॥ భుజంగప్రయాతము॥ హరశ్రీపదాంభోరుహద్వంద్వపూజా। పరాధీనకారుణ్యపాథోనిధానా। కురంగేక్షణాపుష్పకోదండమూర్తీ। శరచ్చంద్రికాస్నిగ్ధసంసిద్ధకీర్తీ॥

గద్య * ఇది శ్రీకమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ సార్వభౌమ శ్రీనాథ నామధేయ ప్రణీతంబయిన కాశీఖండం బను మహాకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము,

## కాశీఖండము - ద్వితీయాశ్వాసము.

క॥ శ్రీరాజమహేంద్రవరమ। హారాజ్యశ్రీస్వయంవరాధీశ్వరశృంగారకళారూప కేతన। యారాధితభుజగహారయుక్ష్మయువీరా॥ వ॥ అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నివ్విధంబున నకాండప్రళయంబు సంభవించిన నమరాసురోరగంబగు లోకంబు గాందిశీకంబగుటయు మునులు దేవతలు నుగూడి బ్రహ్మలోకంబునకుం బోయి బ్రహ్మ నిట్లని స్తుతియించిరి॥ గీ॥ బ్రహ్మ బ్రహ్మస్వరూప హిరణ్యగర్భ। యమృత కేవలయ ప్రతర్క్యానుభావ। వేదవేద్య చిదాత్మ యనాదినిధన। చిత్తగింపుము సంస్తుతిం జేద మనిన్ను॥ గీ॥ డెందమును వాక్కు నెవ్వానినంద లేవు। కాంతు రెవ్వాని దహరపుష్కరమునందుఁ। బరమయోగీంద్రు లధికతాత్పర్యలీల। నట్టి నీకు నమస్కారమ ఖిలవంద్య॥ గీ॥ ప్రకృతిరూప గుణత్రయోపాధియుక్త। కాలకాలాతిరిక్త నిష్కామహృదయ। సత్వగుణమున హరివై రజస్తమోగుణముల శంభుండవగు నీకునతిశయించి॥ సీ॥ బుద్ధ్యహంకారరూపునిభజింతు మునిన్నుఁ బంచతన్మాత్రరూపా భజింపు। పంచకర్మేం

ంద్రియపంచబుద్ధీంద్రియాత్మకమనోరూప యేమఱకుమమ్ము। క్షిత్యాదిపంచ
కాకృతివమ్మ క్షింపువిషయాత్మకామమ్మవిడువవలదు। బ్రహ్మాండరూపమా
పాలి పెన్నిధినీవు పాలింపుమమ్ముఁదదభ్యంతరస్థ। కొలుతుమర్వాక్పరాగ్రూపు
గోరినిన్ను। విశ్వరూపునినిన్ను సేవింతు మెప్పుడు। సవధరింపుమునిత్యసత్యస్వ
రూప। సదసదీశ్వరయుభయహస్తంబునూపు॥ సీ॥ నిగమత్రయంబునీనిశ్వాస
పవనంబునీమూర్తి-భేదంబునిఖిలజగము। నీయంఘ్రిమేదినినీమూర్ధమాకాశ
మంతరిక్షము నాభియండునీకుఁ। జంద్రుండుహృదయంబుచక్షువబ్జహితుం
డుతనురుహావ్రాతంబుదరులునీకు। నీవుసర్వంబునునీయందుసర్వంబు స్తోత్ర
స్తుతి స్తవ్య జాతమీవు। మొక్కెదమునీకునమహామునులుసురలు। సకల
తలమున సేవాంజలులుఘటింప। ద్రుహిణుఁడంతయునాత్మసంతోషమంది।
యందఱినిజూచియిట్లనియానతిచ్చె॥ గీ॥ ఆర్యమగుమీ స్తవంబునకనఘులా
ర। యేనుబరితుష్టినొందితినిచ్చయుందు। నేమివలసినసట్టిదయిచ్చుఁగాన।నిది
యభీష్టదమను పేరనింపుమిగులు॥ మ॥ నిరవద్యస్థిరభక్తితోడననుఁగానీశంభుఁ
గానీరమే। శ్వరుఁగానిగుఱియించియెవ్వరఁటయీసారస్తవంబుజ్జపించి। తురు
ష్ఠారందఱకేముముప్పురముసంతుష్టింబ్రసాదింతుమిం। పరుదారక్షధనధాన్య
పౌత్రపశురక్షాయుస్సుఖారోగ్యముల్॥ వ॥ మీకెయ్యదియుఁటవరంబుగోరుం
డిచ్చెదనిక్కడికివచ్చియుని క్ష్లేటికినాకులత్వంబువిడువరుస్వస్థులుగంద్రునాలో
కంబునఁ గామక్రోధలోభమోహమదమాత్సర్యహింసాసూయాదులు లేవు
మూర్తంబులగునీయామ్నాయంబులు విద్యలుయజ్ఞంబులుదక్షిణాలు సత్య
ధర్మతపోబ్రహ్మచర్యముఖ్యంబులు నుల్లసిల్లెడుంజూడుండని మఱియునిట్లనియె॥
సీ॥ తల్లిదండ్రులకునిద్ధపుభక్తిఁబనిసేల్ల శుశ్రూషచేసినశుద్ధమతులు। పతుల
కునిర్వ్యాజపరమతాత్పర్యతఁ బరిచర్యసలిపినపద్మముఖులు। సజ్జనావిలికిని
ష్కారణంబున నుపకారమొనర్చిన ధీరగుణులు। దఱిదప్పకుండ సంధ్యాజప
హోమము తంత్రంబులు నెఱపినధర్మవిధులు। బ్రహ్మరతులుతపస్వులు భవ్య
తీర్థ। సేవకులునుసద్వ్రతులు నిస్పృహులుమొదలు। గాఁగనొప్పెడు తత్ప
ణ్యకర్మపరులు। వీరెచూడుఁడుసుఖమున్నవారలిందు॥ క॥ నుతిచేసియిష్టధన
ములు। క్షితిసురులకునొసఁగినట్టిశిష్టులువొండీ। యతులహిరణ్మయహర్మ్య
స్థితులగుచుఁజరించువారుచిరశుభలీలన్॥ గీ॥ ఉభయముఖులగుగోవులనొండె
నొండెఁగపిలలగుధేనువులఁ బున్యకాలతిథుల। దానమొనరించినట్టి సత్యప్రతి
జ్ఞు। లీమహామహాపీఠంబుల నెసఁగువారు॥ వ॥ అని చెప్పియప్పరమేష్ఠి బ్రాహ్మ
ణులసామర్థ్యంబును గోవులమాహాత్మ్యంబును నొక్కొంచుకవర్ణించుచెలంపున

గిట్లనిరి॥ గీ॥ నాకశంభునకును బద్మనాభునకును। దుష్టికరములు రెండు వస్తు
వులుగలవు। విప్రులను గోవులనునవి వినుఁడు మొదల। నొక్క కులము ద్విధా
భంగి నొందియుండు॥ చ॥ సకలఫలంబులుం గురియు జంగమతీర్థము లెందు
బ్రాహ్మణా। ప్రకరములట్లు గానఁ బెడవాయుట యెట్లు తదీయభాషణో। దకము
లు సేవకావలికిఁ దక్షిణమాత్రపజన్మజన్మబో। ధకశతసంగతంబులగుఁ దత్తదశే
కమహాఘపంకముల్॥ చ॥ వినుఁడనయంబు గోవులు పవిత్రము గోవుల మంగ
ళంబుద। ద్ధనఖురటంకశృంగపరిఘట్టదళద్ధరణీరజశ్ఛటల్। గనుఁగొనినప్పు చుం
డుఁ బురఘస్మరమూర్ధజటాటవీనట। ద్ధనపదసింధువార్ల హరిగర్వభరార్భటిఁ
బాపనోన్నతిన్॥ చ॥ ప్రతివసియించు గోవులఖురంబులయందు సమస్తతీర్థ
సంతతియును సర్వపర్వతవితానము గొమ్ములమధ్యసీమన। ద్భుతచరితుండు
శంకరుఁడు భూధరకన్యయుఁ దానునుండుఁద। ద్వితతకుచేభకుంభ పరిదిగ్ధపటీర
పవిత్రవత్తుఁడై॥ క॥ కొనియాడుఁ బితృగణంబులు। గొనియాడు ఋషిప్రజము
లు గురుసమ్మదముల్। జనియించు వేల్పులకుఁ గం। దని పెంపున నరుఁడు గోవుదా
నము సేయన్॥ శ్లో॥ గోమయం యమునా సాక్షాద్గోమూత్రం నర్మదా సదా। శు
భా చ గఙ్గా క్షీరస్తు యాసాం వై కిమతః పరమ్॥ గవామఙ్గేషు తిష్ఠన్తి భువనా
ని చతుర్దశ। యస్మాత్తస్మాచ్ఛివం మే స్యా దిహలోకే పరత్ర చ॥ క॥ అనుమం
త్రంబులు చెప్పుచు। నొనరించిన ధేనుదానము ర్వీసురవ। ర్యున కొప్పఁ దాతఁ దధి
గత। వినుతులు గను జగమునందు విశ్రుతలీలన్॥ క॥ స్తుతిపూర్వముగఁ బ్రదక్షి
ణ। మతిభక్తి రచించు నెవ్వఁడా వులకతఁడన్। ధృతిఁ బొందునపుడు సకల। క్షితి
కిఁ బ్రదక్షిణము నియతిఁ జేసిన ఫలముల్॥

క॥ ముందటఁ బిఱుఁదం బ్రేవల। డెందమున గరము సందడింప సదాయు।
స్పందశుభావహములు గో। బృందములని మాకుఁ బుట్టుఁ బ్రియమెల్లపుడున్॥
క॥ నీరాజనంబు నెఱపుడు। రారఁగ గోపుచ్ఛమున నిజాంగంబులకె। వ్వారలు
వారలయఘములు। దూరమున నడంగు నిండ్ల దొరకొను బ్రియముల్॥ గీ॥ వినుఁ
డు గోవులు విప్రులు వేదచయము। సతులు లోభవిహీనులు సత్యపరులు। దాన
శూరులి ర్వ్యేడును దాల్చు నెపుడు। నవని నెంతయు విగతభయంబు గాఁగ॥ గీ॥ నా
డు లోకంబునకు మీఁదు నలిననాభు లోకమందూర్ధ్వమగు గుహలోకమవల।
భర్గులోకంబు దత్సమీపస్థలమున। గోకులంబుల లోకంబు గొమరుమిగులు॥
సీ॥ ప్రవహించు నెచ్చోటఁ బరిపూర్ణ సంపదఁ దొలుకాడుచున పారదుగ్ధనదు
లు। నవరిల్లు నెచ్చోట జరడగ్గఱఁగనీక సంతతయౌవన సౌష్ఠవంబు। లలఁగొందు
నెచ్చోట నాజ్య నిర్ఝరులతో బహుసంఖ్యఁ బాయసపర్వతములు। బెడగొందు

నెచ్చోటఁగడమ మెంతయు లేమి సామగ్రిశుభవస్తుసంచయంబు । వట్టిగోలో
కమునయందు నధివసింతు । రథవుచేఁబ్రొద్దుప్రొద్దు నెయ్యంబుగనుచు ।నల
ఘుమూర్తులు గోమాతృకలునుసీల । యాదిగాఁగలపరమకల్యాణనిధులు॥
వ॥ అట్లుగావున గోవులకు మిగిలిన యుపాసనీయంబులు లేవు గోప్రదాతల
కు మిగిలిన పుణ్యవంతులు లేరు వెండియు నాకర్ణింపుఁడు సరస్వతీతీర్థమ్మృతు
లును మార్తాండుండు మకరస్థుండగుచుండఁ బ్రయాగతీర్థంబున మాఘస్నా
నంబు చేసిన కృతార్థులును వారణాశియందుఁ బంచనదంబునం గార్తికమా
సంబునఁ దీర్థమాడిన విశుద్ధదేహులును గురుక్షేత్రంబునం గాకణీమాత్రరి
తైనను గనకంబు దానంబొనర్చిన దాతలు మొదలుగాఁగల నానాధర్మపరు
లస్మదీయలోకంబున ఏరేనిజకర్మోచితపథంబులం గల్పస్థాయులయి సుఖం
బు లనుభవించుచున్నారు మీకును నింక భయంబువలవదు మీరు వచ్చిన
కార్యంబె నెఱుంగుదు వింధ్యంబవంధ్యగర్వోదయంబున గీర్వాణభూధరంబు
తో మచ్చరించి శృంగోచ్ఛ్రాయంబులనంబరమార్గం బవరోధించి భువనంబు
లకు బాధసేయుచున్నయది యాయకాండప్రళయంబునకు బెగ్గలంబంది యా
వత్పరిహారార్థంబు నన్ను శరణంబుఁజొచ్చితిరి యరిష్టనిరసనంబునకు నుపా
యంబు చెప్పెద మహాముని యగస్త్యుండవిముక్తంబను విముక్తక్షేత్రంబు
న విశ్వేశ్వరువిరూపాక్షు భోగమోక్షప్రదాయకుం దారకబ్రహ్మోపదేశా
ర్థంబు సేవించుచున్నవాఁడతఁడు మీకార్యంబు సంఘటింపంగలవాఁడు మీ
ర వచ్చోటికరిగి యమ్మహాత్ము నభ్యర్థింపుఁడు॥ క॥ వాతాపీల్వలులనియెడు । దై
తేయులఁగుటిలకపట తగ్రతోద్ధతులన్ । భ్రాతలవధించెవేల్మిడి । నాతండెల్ల
రును చెఱుతు రమ్మునిపతికిన్॥ వ॥ పొందు మీకు మేలయ్యెడునని పుండరీకభ
వుండు వీడ్కొలిపినవారును మహాప్రసాదంబని ప్రసన్నాంతరంగులై సత్య
లోకంబు వెలువడి వచ్చువారంతరాంతరంబుల మూర్తిమంతంబులైన వే
దంబుల వేదాంగంబుల యజ్ఞంబుల దక్షిణల సత్యంబు ధర్మంబు దపంబు
శ్రుతి స్మృతిపురాణేతిహాసంబులం బతివ్రతల బ్రహ్మచారుల మాతాపితృభ
క్తుల గోగవాణహితుల గాయత్రీజపపరాయణుల నుభయముఖిగోప్రదాత
లఁ గపిలదానతత్పరుల బ్రాహ్మణపాదోదకప్రాశనుల సరస్వతీతీర్థమ్మృతుల
మకరరాశిస్థితుండై మార్తాండుండుండ మాఘస్నానంబు ప్రయాగతీర్థంబు
నం జేసిన కృతార్థుల వారణాశియందుఁ బంచనదంబునం గార్తికమాసంబునం
దీర్థంబాడిన విశుద్ధదేహులఁ గురుక్షేత్రంబునం గాకణికామాత్రంబైనను
గనకంబు దానంబుచేసిన దాతలను మఱియును బుణ్యవంతులను విలోకించు

చు వెలువడి॥ గీ॥ విమలకైవల్యకల్యాణ విత్తనిధికి। విశ్వనాథుని మొదలిశ్రీ
వేశ్మమునకుఁ। గాశికాక్షేత్రమునకేగఁ గదలినపుడు। గోర్కులిగురొత్తబ్బం
దార కులునుమునులు॥ వ॥ హర్షోత్కర్షంబునం దమలోన॥ సీ॥ మనభాగ్య
మునఁగాదె కనకాచలేంద్రంబు విశ్వాధికోన్నత విభవమొందె। మనభాగ్య
మునఁగాదె మార్తాండమండలివిసుపీధరోధించె వింధ్యశిఖరి। మనభాగ్యము
నఁగాదె మర్త్యపాతాళత్రివిష్టపంబులకు సరిష్టమొదవె। మనభాగ్యమునఁగా
దె కనకగర్భుండుప్రత్యక్షమైయుపదేశ మానతిచ్చె। నహహా మనభాగ్యము
నఁగాదె యమరతటిని। దరివసించినవాఁడు వాతాపిదమనుఁ। డిన్ని భాగ్యం
బులునుగూడి యిచ్చె మనకుఁ। గాశికాక్షేత్రరాజ వీక్షాసుఖంబు॥ క॥ ఏక
క్రియఫలయుగ్మము। నాకర్షింపంగఁజాలు నాలోపాము। ద్రాకాంతు గుఱించి
పోవఁగ। శ్రీకాశీదర్శనంబు సిద్ధించెదగన్॥ వ॥ అనుచు బ్రహ్మలోకంబున
నుండి డిగ్గి వారు వారణాశిపురోపకంఠంబున శ్రీకంఠజటాటవీకుటజకోర
కంబును బరమేష్ఠికమండలుసలిలధారాధోరణియునుం గుపితకపిలముని పరి
వృఢకపిలదృగనలచుళికితవపుర్ఖలసగరసుత స్వర్గారోహణసోపానమార్గం
బును నగు భాగీరథియందు మణికర్ణికాకుండంబునఁ దీర్థంబాడి తీర్థోపవా
సులకు వాసోహిరణ్యగంధసార కర్పూర కస్తూరికాకుంకుమంబులను ఖండ
శర్కరాపూపసూపాజ్యదధిపయఃఫలాది తర్పణద్రవ్యంబులను పానత్పాదు
కాచ్ఛత్రంబులను గుండికాదండకల్లకవ్యజనచామరంబులఁ గౌపీనశాటికాక
రండంబులను దైలలవణేంధనంబులను గుగ్గులు మహిసాక్షిప్రముఖ ధూప
ద్రవ్యంబులను వెండియుం గ్రియాకాండంబులనుం బరితోషంబు సంపాదిం
చి విశుద్ధహృదయులుఁ బ్రసన్నాత్ములునై శ్రుతిస్మృతిపురాణేతిహాసప్రతిపా
దిత వేదానువచనయజ్ఞదాన తపోవ్రతాదులచేతం బ్రక్షీణ సకలకలుషులు
భస్మోద్ధూళితాంగులు రుద్రాక్షమాలికాలంకారులునై శంకరుం గురంగాం
కశేఖరు నిరస్తసమస్తోపాధిక స్వప్రతిష్ఠాఖండసచ్చిదానందైక రసాద్వితీయ
స్వరూపువిరూపాక్షు విశాలాక్షీహృదయాధీశ్వరువిశ్వేశ్వరమహాదేవు సంద
ర్శించి ప్రణమిల్లి జగన్నిర్మాణనియమ పరిపాలనాశక్తియుక్తుండగు సద్దేవుం
బంచబ్రహ్మపంచాక్షరప్రణవమంత్రంబుల నావాహనస్థాపనసాన్నిధ్య సన్ని
రోధన సంకలీకరణాదులగు దశవిధసంస్కారకలాపంబుల నుపచరించి
వెండియు॥ క॥ ఆడిరి ప్రమోదనృత్తము। పాడిరి ముద్రకమహా ప్రబంధంబుల
మో। మోడిరి తైర్థికులకుఁగో। ల్లాడిరి కైవల్యలక్ష్మి నమరుటు మునులున్॥
సీ॥ అన్నదంబ చేసిరి యభవు గేహముసకు ధన్యాత్ములంగ ప్రదక్షిణములు। దో

గవీశారూఢసుమఁబోటి నర్చించి రభ్యర్హితులుసువర్ణాంబుజముల। డుంఢివి
ఘ్నేశులడ్డుకపూపమోదకాద్యుపహారములఁ దృప్తినొందఁ జేసి। రవధరిం
చిరిపురాణాఖ్యానముఖముల సమధికంబగు మహాస్థానమహిమ। వీటిపెద్ద
తలారిపిస్సాటికలికి। దిస్సమొలవేల్పుపార్వతీ దేవిపట్టిఁ। గాలభైరవుఁగుర్కు
రగణ పరివృఢు। ననుచరించిరిమునులు నాకౌకసులును॥ వ॥ అనంతరంబ॥
సీ॥ పంచాక్షరీమంత్రపారాయణమునకు నెవ్వానిమానసం బేడుగడయు। ద
ర్పోద్ధతులగువాతాపీల్వలులకును వధశిలాస్థానమెవ్వానికుక్షి। యాదినె
వ్వానిదివ్యావతారమునకుఁ బూర్ణాంబుకుంభంబు పురిటియిల్లు। మెఱిలోపా
ముద్రమెఱుఁగుపాలిండ్లపైఁ బవళించు నెవ్వాని భవ్యమూర్తి। కసరిమెవ్వా
నికంఠ హుంకారరవము। కొండచిలువలకులములోఁ గూర్చెనహుషు। నట్టి
పరమమాహేశ్వరు నలఘుతేజు। వెదకిరానందవనములో విబుధమునులు॥ సీ॥
డుంఠివిఘ్నేశుఁడుండు ప్రదేశమీక్షించి లోలార్కునగరిమోసాలవెదకి। దం
డపాణ్యానవ భాండేశ్వరంబులుగుక్కుటస్థానంబు గుద్దలంచి। కేశవస్వామి
లోఁగిలి పరామర్శించి కాలభైరవదేవు గవనుజూచి। శ్రీవిశాలాక్షిగోష్ఠివాటి
శోధించియుపవర్గమంటపోపాంతమరసి। విబుధగంగాతరంగిణీవేణిమధ్య। సై
కతోత్సనవేదికా సంప్రరూఢ। తరుణమంజులకుజవేతసకుడుంగ। వీథికల
యంమదృష్టి యావిష్కరించి॥ వ॥ కుంభసంభవు నన్వేషించువారు జగద్ధిత
కార్యారంభులు జంభమథనపురోగములైన సురలును గీష్పతిప్రధానులైన
మునులును నానందకాననంబున మహాశ్మశానంబున రుద్రావాసంబునం గాశి
యును వారణాసియనునవి ముక్తక్షేత్రంబున లోలార్కకేశవులు కోటిద్వ
యంబును భాగీరథినారియుధర్మంబుశరంబును గవిలత్ర్యంబును విరూపాక్షుం
డు ధన్వియుంగా ముక్తిపురంధ్రీభ్రూలతానుకారంబును జంద్రరేఖాచ్ఛాయా
ప్రకారంబై తాను గోదండంబుభంగి నంగీకరించి విశ్వేశ్వర శ్రీమహాదేవున
కు నిఖిలదేవతాసార్వభౌమునకుఁ ద్రైలోక్యసామ్రాజ్యపట్టాభిషేకంబునకుఁ
దగు పీఠంబునుం బోని యమ్మహాస్థానంబు గలయఁ ద్రిమ్మరి యచ్చోటిపె
ద్దలవలనం గందువమెఱింగి చని తత్పుణ్యాశ్రమంబుఁ బ్రవేశించి రందు॥ సీ॥
కండూయనము సేయు కరటిశుండాదండ పుష్కరమ్మున సింహపోతకంబు। వా
లారునఖములవదనమించుక మెత్తి ముద్దాడుఁబులిలేఁటిముద్దరాలి। నిందుకొఁ
గిటఁజేర్చి నెమ్మిమైఁ ద్రోడేలుగౌదమచింబోతునుగుస్తరించుఁ। గుఁజమంటప
కుటీక్రోడ మధ్యంబున నాఖుతోఁ జెలలాడు నడవిపిల్లి। యొండదాఁకకయుం
డంగ నెత్తిపట్టుఁ। బగలుముంగికి భుజగంబుపడగగొడుగు। కోఁతితో మైత్రివా

టించుకొండగొఱియ। యాజ్ఞ్వకేయుని పుణ్యాశ్రమాంతరమున॥ వ॥ వెండి
యునవ్వనంబునఁనీవారోదన మండంబుష్ణ మధురంబుగగండూషించి క్రొత్త
పురిటాలికింగురంగికిమెత్తమెత్తసకురంగంబుగ్రోల్చుం బ్రసర్పత్స్ఫుర్ధిరభిఘాత
ప్రవాహధారాగంధపాణిం ధమంబై కర్కంధూఫలోన్మిశ్ర శాకపాకంబుల
తాలింపులకమ్మ నికంపుపాంథఘ్రాణంబుల కింపుసొంపుసంపాదించు సరసీతీరం
బునసారసంబుసారస్యంబు పక్ష్మలింపలక్ష్మ నాకంఠోపకంఠంబునం గంఠంబు
జేర్చిసుఖపారవశ్యంబునం జొక్కనోముక్కంటిలోఁగంటంగనుంగొనుచుని
శ్చలధ్యానయోగానుసంధానంబునమాధుర్యంబుభుజించెనో యెఱుంగరాకుం
డనుండు శ్రుతిస్మృతిపురాణేతిహాససంహితా తాత్పర్యపర్యాలోచనపచేళిమం
బైనవివేకంబున మత్స్యమాంసంబభ్యహితాతులు పరిహరింతురని యెఱింగి
కాఁబోలుఁబంకజోత్పలకుముద కల్హారసంకులంబులగుకొలంకులఁ బెద్దమీను
కొండికమీనుం దాఁకదుదరవికచవకుళకురువక నాగకేసరపరాగధూసరంబు
లగుమధుమాసవాసరంబులందును బంచబాణుండించువిల్లెక్క వెట్టవెఱచుం
గావునఁగొంచికొంచియుఁ బశుపక్షిమృగమిథునంబులు నిధువనక్రీడలాచరిం
చుఁ గంఠగత ప్రాణంబులగుజంతువులకుం గాలకంఠుండు గరుణావశంవదుం
డై కర్ణోపకంఠంబుచేరి యుపదేశించుతారక బ్రహ్మమంత్రరాజంబుమంత
నంబునవిని యెఱుఁగుటంజేసి మధుమదోల్లాసంబుననది వెల్లివిరి సేయుచున్న
యవియోయన నిందిందిరంబులుమందస్వరంబున ఝంకారంబుసేయున క్తభో
జనవ్రతస్థులతోడిసంసర్గంబుననో చకోరవర్గంబున క్తంబులం జంద్రచంద్రికాక
రంభంబునఁ గాంక్షింభర్యంబునంభావించునట్టి పుణ్యాశ్రమంబు దరిసి చనుస
ప్పుడు మునులుబృందారకులునునిజాంతర్గతంబున॥ గీ॥ ఎన్నఁడును సేగిలేనట్టి
యిమ్మహాశ్మశానమునయందుఁగావున్న జంతువులకు। నేటినాకంబుపుణ్ణెయం
బడలినప్పు। డొాఱకమునఁగూలవలయుఁ గీలూడినట్లు॥ గీ॥ అపునరావృత్తి
శంభులోకాధివాస। సౌఖ్యమొనఁగూడునిచ్చోటిజంతువులకుఁ। గాసమునకం
ఱుఁగడుమేలుకాశినుండు। కీటపక్షిసరీసృపక్రిమికులంబు॥ సీ॥ కాశికానగరం
బుకడసీమనమునున్న చండాలుబోలరాఖండలాదు। లానందవనములోనసశేన
స్థితినున్కిభువనసామ్రాజ్యవైభవముఁబోలు। నవిముక్తదేశస్థుఁడయ్యోనేఁబ
తితుండునశ్వమేధాధ్వరాహర్త దొరయు। వారణాశీసంభవంపైన మశకంబు
నైరావణముతోడ నవఘళించు। నాఁటుకొనిశ్రీమహాశ్మశానముననున్న। యు
ణుకనగ్నాలవటుఁడైనసాగ్రహమున। గర్వితోద్ధతినేలెంచుకాళరాత్రి। మృ
త్యుదేవతమునిపండ్లు మెఱకోఁజాలు॥ గీ॥ ఎన్నికల్పంబులరిగిన నెడలిపోవ। దం

దరిద్రులుగడచిన నెలమిదప్ప। దెన్ని మన్వంతరంబులుచన్న నెపుడుఁ। బసిమిద
ప్పదుకాశికాపట్టణంబు॥ ఉ॥ తత్తరపాటు లేకనదిదాన మొనర్చిపినాకపాణిదే। వో
త్తమువిశ్వనాథుఁగరుణోదధిఁగమ్మనిపువ్వుగుత్తులన్। బత్తిరిఁబూజచేసినుతి
పాఠములన్ శ్రవణించువారికిన్। దొత్తులువోలెఁ దక్కు దురుదొప్పులుదోరలు
ముక్తిభామినుల్॥ సీ॥ ధర్మంబుకాశికాస్థానమధ్యంబున నాల్గుపాదంబులనడచి
యాడు। నర్థంబుకాశీపురాంగణంబునయందు నానాప్రకారమైపీనుమిగులుఁ।
గామంబుకాశికాకటకఘుంటావీథి గర్వించురాజలోకంబుఁ జేవ। మోక్షసంప
దలుకాశీక్షేత్రమునయందుఁబ్రవిత్తండంబులై నివ్వటిల్లుఁ। గాశికల్యాణమునో
కాదికారణంబు। కాశిఁయణిమాదిసిసిద్ధులకట్టుపట్టు। కాశిజనలోకసంకల్పకల్ప
వల్లి। కలుషపిశితంబుమొనవురా కాసికాశి॥ సీ॥ ఉర్వీధరశ్రేణులు జ్ఞానులౌ
గంగనేదుగాడ్పులువీచు నెన్నఁడేని। చండభానుండుపంద్రెండుమూర్తులుదా
ల్చిమొనఁగి గొండలుగాయునెన్నఁడేని। పుష్కలావర్తకాంభోధరవ్రాతం
బులెలగోలువర్షించు నెన్నఁడేని। భూర్భువస్వర్లోకములుముంచి జలరాసులే
కోదకముచూపు నెన్నఁడేని। యెన్నఁడేనుండుగాలంబుమిన్నచిక్క। భూతము
లుగ్రాలు నెన్నఁడేఁబుట్టినిండ్లు। నవుడువారాణశిక్షేత్రమైదుక్రోసు। లంతమేర
యుపద్రవంబందకుండు॥ గీ॥ ఉత్తరోత్తరమభివృద్ధి నొందుచుండుఁ। గాశిధ
ర్మార్థ కామమోక్షములునాల్గు। చంద్రకళయట్లుశుక్లపక్షంబు రేలు। నాఁడు
నాఁటికి నభివర్ధనంబునొందు॥ సీ॥ పాలిండ్లుగదలంగఁబసవుపయ్యెదవిచ్చన
చలాధిపతికూర్మియాఁడుబిడ్డ। ధూంత్కారమొనరించుతొండంబుముక్కున
శీకరాసారంబుచిలుకుడుంఠి। ప్రత్యక్షమైవచ్చి భాగీరథీగంగమ్మదులహస్తము
సాఁచిమేనునిమురుఁ। బ్రమథోత్తముఁడుభృంగిభయరక్షణార్థమైఫాలాగ్ని
మునఁదీర్చుభసితరేఖ। దక్షిణశ్రుతిలిమీఁదుగాధాత్రిఁజెంది। పెద్దనిద్రకుబ్రమా
గన్ను వెట్టువేళఁ। బంచజనులకుఁదారకబ్రహ్మవిద్య। యభవుఁడుపదేశమొన
రించునవుడుగాశి॥ వ॥ అనివారణాశిపురంబువర్ణించుచు॥ గీ॥ వృక్షశాఖాం
చలంబుపై వ్రేలుచున్న। కోటిసంఖ్యలనీర్కావిగోవణములు। విఘ్నమృగము
లఁబట్టంగవేసినట్టి। చీరతెరలనుసంస్మృతిచిగురుగొల్పు॥ సీ॥ ఎదురలోపాము
ద్రపదపద్మములముద్రసికతిలంబగునేలఁజెలువుమిగుల। శ్యామాకముష్టియా
ఖ్యాగంబుమృగములు ఋషికన్యకలరాకకెదురుచూడ। దేవార్చనాహూపదివ్య
గంధములచేహోమధూమముతావియుద్దివడయ। వటుజనస్వాధ్యాయవర్ణ
సందోహంబుశారికశుకంబులుచర్చసేయఁ। గాశికాపట్టణమునకుఁగ్రోశమాత్ర।
గగనగంగాప్రవాహసైకటికభూమి। బ్రహ్మలోకమునకునుప్రాసమైన। కలశజ

నిషణ్ణశాలడగ్గఱిరిమునులు॥ వ॥ అప్పుడు॥ మ॥ శివుఁడేదాతశివుండెభోక్తశి
వుఁడేచేయున్మఖాదిక్రియల్। శివుఁడేవిశ్వమున్ శివుండెయనుచున్ జింతించు
చున్ జాహ్నవీ। సవిధశ్రీఫలవృక్షవాటమునభస్మస్నానశుద్ధాంగుఁడై। భవకా
శీధవనీలకంఠయనుచున్ భావించుధన్యాత్మునిన్॥ క॥ రుద్రాక్షభూతిముద్రా।
ముద్రితనిఖిలావయవుని ముక్తిపదశ్రీ। భద్రాసనస్థులోపా। ముద్రాపరిపూ
ర్ణపార్శ్వమునిపుంగవునిన్॥ మ॥ నిజనామంబునశంభులింగము భవానీదృ
క్కారంభంబునం। బుజగర్భాదిసురేంద్రవందితపదాంభోజంబుగల్పించెమం।
త్రజపధ్యానపరాయణుండగుచుఁదత్పార్శ్వంబునన్ దీపిరా। డజినాగ్రంబు
ననున్న పాశుపతవిద్యారాజ్యపీఠస్థునిన్॥ క॥ పాటలజటాకిరీటుల। లాటం
తపనత్తసత్తిలలితమనోజ్ఞ। స్ఫాటికమణిజపమాలా। వ్యాటికిరత్కారసరోరు
హాంగుళిపార్శ్వున్॥ క॥ పంచబ్రహ్మంబునుశ్రీ। పంచాక్షరమునునఘోరపా
శుపతంబుల్। గించిత్ప్రస్ఫురదధరో। ష్ఠాంచలముగజపముసేయు నాదిమశై
వున్॥ మ॥ అవధానంబుననప్పటప్పటికిభక్త్యావిష్టుఁడై పార్వతీ। ధవగంగాధర
నీలకంఠమదనధ్వంసీమహాదేవరు। ద్రవిరూపాక్ష భుజంగహార యనుచున్
ధారాధరవ్యూహసం। భవగర్జారభటిన్ బఠించుపరమబ్రహ్మర్షిన్ లేఖర్ష
భున్॥ సీ॥ అంతర్విలోకనవ్యాప్తియుద్వాసించి బాహ్యంబునకుదృష్టిపాఱ
విడిచి। లీలరుద్రాక్షమాలికదక్షిణ శ్రవణశష్కులీశిఖయందు సంతరించి।వ
దిలంబుగామున్ను పరిధవించినయట్టి నలినాసనంబు బంధమువదల్చి। వేదా
గమపురాణవిద్యోద్భవములైన పురమర్దనస్తోత్రములుపఠించి। యప్పుడప్పు
డయోగసమాధియుడిగి। యధికశాంతిప్రసన్నాత్ముఁడై నవాని। బ్రణవపంచా
క్షరీమంత్రపరమసిద్ధుఁ। గుంభసంభవమునిఁగనుంగొనిరి సురలు॥ గీ॥ జయజ
యధ్వనులెసఁగంగసంయములును। నమరులును మ్రొక్కిరపుడమ్మహాత్మునకు
ను। బిన్న పెద్దతనంబురూపింపనీదు। శాంభవంబైనదివ్య తేజంబుమహిమ॥ వ॥ అ
గస్త్యుండును బ్రత్యుత్థానంబుచేసి యందఱకు నాతిథ్యసత్కారంబొనర్చి సు
ఖాసీనులైనవారిం గుశలప్రశ్నపూర్వకంబుగావాగమనకారణంబడిగిన॥ గీ॥ ము
నులునమరులు నత్యంతవినయపరతఁ। దారువచ్చినకార్యమంతయును జెప్పి।
యావదర్థపదోక్తవిద్యానిరూఢు। నాంగిరసుఁ బ్రార్థనముచేసిరధికభక్తి॥ వ॥ బృ
హస్పతియునమ్మహానుభావునవలోకించియిట్లనియె॥ సీ॥ ధన్యాత్మకుండవుమా
న్యుండవెంతయుఁగృతకృత్యుఁడవుజగద్ధితకరుఁడవు। ప్రత్యాశ్రమంబునుబ్రతి
నగరంబునుబ్రత్యరణ్యంబును వ్రతులు లేరె। నీప్రతాపంబును నీప్రభావంబునీ
యౌదార్యమును నెందు లేదుగాన। బ్రణవపంచాక్షరబ్రహ్మవిద్యామహా

పనిమత్తునిపాణిపల్లవాగ్ర। మిట్టినిను వేఁడవచ్చితిమిందఱమును। గమలగర్భుని యానతిఁగాశిపురికి। భువనసంక్షోభకారివై పుట్టినొక్క । కడిఁదియుత్పాత మదినీవు గడపనలయు॥ వ॥ అనిపలికి వాచస్పతిప్రముఖులకు వాసవయుంబో లె నవిసాభాగ్యసంబంధంబున నమ్మహామునికి సహధర్మచారిణివై యరుంధతికి సావిత్రికినసూయకుశాండిల్యకు సరస్వతీలత్సులకుమకు శతరూపకు మేనకకు సునీతికిసంజ్ఞకుస్వాహాకుందోడిజోడగులోపాముద్రఁవీక్షించియిట్లనియె॥గీ॥ అమ్మకుశలంబెసాధ్వియనామయంబె। దేవిభద్రంబెలెస్సలాపూవుబోఁడి। పారవరమపతివ్రతాచారవైభ। వాధిరాజ్యంబుజరుగుచున్నదియెతరుణి॥ సీ॥ప్రాణేశుఁడారగింపకభుజింపవు భర్తనిద్రింపకయ మున్ననిద్రవోవు। నాథుండు మేలుకొనకమున్న మేల్కాంతువై సేయ కెన్నఁడుగవయువథిపు। ధవుఁడుపోషితుఁడైవతటి వాడియుండుదు పతికిసెప్పందుమాఅపలుకనీవు। పురుషునీగికినల్పమునకు సంతోషింతు మొగమెత్తిసేరవు మగనియెదురఁ। జెరఁగుమాసిన మూన్నాళ్లుసిగ్గుతోడఁ। బతివిలోకనమార్గంబుపరిహరించి।సవితుఁడుదయింపనాల్నాళ్ళజలకమాడి। చూడవెవ్వారిఁబురుషునిజూచికాని॥మ॥పసపుంగుంకుమకజ్జలంబునునుగూర్పాసంబుతాంబూలముల్। గుసుమంబుల్కబరీభరంబుచెవియాకుల్ మంగళాలంకృతుల్। విసువొక్కింతయులేకతాల్పవలయుంబీనిఁసదాకాలము। స్వసిచక్రంగ్రబియుండువర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్॥ గీ॥ రజకితోడనుదక్యతోశ్రపణతోడ। విధవతోనాథుతోరాయువెలఁదితోడ। జెడిపెతోఁజాలఁబోరామిసేయఁజనదు। ప్రాణసంకటములను బుణ్యాంగనలకు॥ సీ॥ పతిపిల్వఁబంచినపనియేమియనివచ్చి చెప్పినయుడిగంబుసేయవలయు। భర్తయానతిలేక ప్రకృతిబంధునకైన నేపదార్థంబును నీగిపెట్ట। జీవితేశ్వరుఁడుడించినయోగిరంబులు గుత్ససేయక భుక్తిగొనుటలగవు। సుఖసుప్తుఁడగునిజేశుఁబ్రబోధమొనరింపఁగా దనుస్థానభంగములుదప్పు। నొంటిసెచ్చోటికనుగుటయుక్తిగాదు। తడువుగట్టకళీళ్ళాడఁదగవుగాదు।కడపమీఁదనుమతిసన్నెకంటిమీఁద। జక్కిమీఁదనుగూర్చుండజాడగాదు॥ క॥ నాగరికత్వమువాచా। ప్రాగల్భ్యముఁజూపఁజనదు పతిముందటనం। భోగక్రీడావిభవో। ద్యోగంబులఁదక్కసతికి నుత్పలనయనా॥ క॥ ఇదిధర్మంబిదియీలువ। యిదివ్రతమిదిపద్వివేక మిదియాచారం। బిదిదేవపూజయధిపతి।యుదితంబాలంబుసేయుచుండుటసతికిన్॥ క॥ కాంతుఁడుసంతోషించిన। సంతోషింపంగవలయుసతికరఁజాత్మక। సంతాపించినపట్టున। సంతాపింపంగవలయుజలజేక్షణకున్॥ వ॥ క్రౌంచదళులుకులటలుపతిదురవస్థఁబొందినఁ దెవులుపడిన శృంఖలాబ

ద్ధుండైనను బరిత్యజింతురు గొందఱితఱిపురుషులు లేమిఁగుందువడినభర్తనధిక
కార్పణ్యంబుపచరించిసర్వస్వర్ణవణత్తైలతండులాదులకై సిబ్బితిపఱుతురు కొం
దఱిచ్ఛావతులు ప్రియుండు దమకునేమియిచ్చిన మెచ్చక హెచ్చుకుండాడు
దురు కొందఱువరాక లేకాకినులై మగని మొఱఁగియెక్కడికేనియుంబోదురు
కొందఱుదుశ్శీలలశ్లీలవాక్యంబులనందందఁ బ్రియుని ముందటమం దెమేలంబు
నంబేరులుదురిందఱు నాథునింగులంబువారిని నరకంబునఁద్రోచి తారునునం
దకూలుదురు॥ సీ॥ చీఁకటితప్పుచేసిన సరోరుహనేత్ర గూబయై మెవసియించుఁ
గోటరమున। వింతవానిఁగటాక్షవీక్షణంబునఁజూచు గినల మొష్ఠి వహించుఁ
గిల్లకన్ను। మగఁడుదన్నొత్తినమాఱొత్తుసలివేణివ్యాఘ్రియైజనియించు వన
ములోనఁ। జిఱుదిండిఁదనవారి మొఱఁగియాహారించు నతి వెసూకరజాతియం
దుఁబుట్టు। నధిపుఁగోపించిహుంకారమాచరించు। పడఁతిమూగవునవతి సౌ
భాగ్యలక్ష్మిఁ। జూడఁజాలక మదిలోననూయసేయు। భామదుర్భగయగు
నన్యభవములందు॥

ఉ॥ దూరముపోయిమెండఁబడిదూపిలివచ్చిన ప్రాణనాథునిన్ ॥ ద్వారకవా
టగేహములదాఁక నెదుర్కొని తీర్థమార్చియా। హారము పెట్టిపీద్యముసమర్ప
ణచేసివిహారశయ్యపై। నూరువులొత్తిచిత్తమునకుబ్బునరించుట ధర్మమింతి
కిన్॥ గీ॥ తగవుపాటించియల్పంబు దండ్రియిచ్చు। నల్పమల్పంబు భ్రాతయు
నాత్మజుండు। ప్రార్థితంబైనధనమునల్పముగనిచ్చుఁ। బ్రాణనాథుని సరియెయే
బంధువులును॥ సీ॥ ఓర్పుమైనుప్పిండి నుపవాసముండనీ మగనాలిసరిపోల్పఁ
దగదువిధవ। సద్భక్తిదేవతార్చనముసేయంగ నీమగనాలిసరిపోల్పఁదగదువి
ధవఁ। దిరిగినానాపుణ్యతీర్థంబులాడనీ మగనాలిసరిపోల్పఁదగదువిధవ। నిద్ర
మేల్కాంచి రేపాడినియమపరత। నహిమభానునివీక్షింపకటకమున్న। తగదు
వీక్షింపనరునకుఁదల్లివది నెవత్తగారినిదప్పించియన్యవిధవ॥ ఉ॥ జీవముతోడఁ
బాసియశుచిత్వముఁబొందినమేనుగంధతో। యావభృథాభిషేకముసహస్ర
ఘటంబులనాచరించినన్। బావనమౌనెయట్లపతిఁ బాసివితంతుతనొందినట్టి
రా। జీవదళాయతాక్షి యశుచిత్వము వాయదు వేతెఱంగులన్॥ గీ॥ ప్రియుము
గలిగినవంగీకరింపవలదు। ముండదీవనరేపాడిమోముఁజూచి। బైసిమాలినపర
మనిర్భాగ్యరాలు। విధవదాని మూశీస్సునువిషసమంబు॥ సీ॥ పెండిలినాఁడు
భూబృందారకులుగన్యనప్పగించిరొ లేదొ యధిపుఁగూర్చి। సహచారిణివిగమ్ము
సకలకాలమునందు నిండుఁజందురుని చంద్రికయుఁబోలెఁ। దోలుకొఱుమొఱఁ
గుపిద్యుల్లేఖయునుబోలె ననుగమింపఁగఁబాడియతిపమగనిఁ। బిత్రుపనంబున

దాఁకఁబతివిమానము వెంటఁ గైసేసి కోలనాఁడఁ గదలు భంగిఁ। బిఱికికండయు
కింత లేక యమి వేడ్కఁ। జచ్చుటకఁబోవు వికచరాజీవనేత్ర। యశ్వమేధంబు ఫలము
తథ్యంబుగ గలుగుఁ। బదము పదమునకిది వేద భాషితంబు॥ గీ॥ పుట్టలోపలి పాము
నభ్యుద్ధరించు। వశ్యమంత్రుండు పాములవాఁడపోలె। భర్త నభ్యుద్ధరించు పా
పంబువలన। నగ్నిఁ జొచ్చినయట్టి పద్మాయతాక్షి॥ గీ॥ పెక్కు మాటలనిటు జా
గు పెట్టనేల। సాధ్వి ఘూర్ణింపనోకఁ జెట్టుచాలఁ గలఁడు। గంధవాహంబు వెఱచు
నక్కలువకంటి। పసుపుపయ్యెద పాలిండ్లఁ బాయఁదట్టు॥ గీ॥ పూర్వశిఖకంటె శిఖ
కంటె నరుక్కకంటెఁ। బిడుగుకంటెను దీవ్రమై బిఱుసు చూపు। నాత్మఁదప్పఁగఁ
దలఁచుదురాత్మకులకు। నహహ పతి దేవతా ప్రభావాతిశయము॥ చ॥ తొలఁ
గుదురంతనంతయమదూతకిరాతులు భీతచిత్తులై। కలుషసమన్వితుండయిన
కాంతుని వారుణలోహపాశశృం। ఖలికలు వీడ్చిపుచ్చుకొని కాంతచితాగ్నిశిఖా
ముఖంబున। వెలువడి యాత్మభర్త వెను వెంట హుటాహుటిఁ గూడవచ్చి
న॥ గీ॥ ఎన్ని కఱరోమకూపంబులెన్ని గలవు। దివ్యవర్షంబులన్ని మోదిం
చు సాధ్వి। నాకభువనంబునందాత్మనాథుఁ గూడి। వెఱపొకింతయు లేక చిచ్చు
ఱికె నేని॥ గీ॥ తండ్రివంశంబునం దేడుతరములకును। దల్లివంశంబునం దేడుతర
ములకును। ధవునివంశంబునం దేడుతరములకును। శాశ్వతస్వర్గసౌఖ్యమిూఁజా
లు సాధ్వి॥ వ॥ అని పలికి బృహస్పతి లోపాముద్రం గనుంగొని నీ ప్రసంగంబునం
గొన్ని యోషిద్ధర్మంబులు చెప్పితి నీవు మహాపతివ్రతవు నీ బోటి పుణ్యవతులు కొం
దఱు కలుగం బట్టి కదా వసుంధర దిరంబై యున్న యది నీకు నమస్కారంబు॥
క॥ మావచ్చిన కార్యమునకు। నీవనుకూలత భజించి నిర్మలకరుణా। శ్రీ వెలయఁ
గఁ బ్రార్థింపుము। నీవల్లభు భువనకుశల నిర్వాహకుని॥ వ॥ అని యగస్త్య మహా
మునిం జూచి వెండియుం బ్రణమిల్లి యాఖండలగురుండిట్లనియె॥ సీ॥ ప్రణవంబు
నీ వృనిరలగుణాలంకారయామ్నాయవిద్యయు యాయలరుఁబోఁడి। తపమిూవు శ
శికళోత్తంసభక్తినిధాన శాంతి యూసంపూర్ణచంద్రవదన। ఫలమిూవు వా
తాపిబలదర్పభంజనసత్క్రియయు యీగంధసారగంధి। మిహిరుండవీవు విశ్వహిత
ప్రవర్తకసైతన్యలక్ష్మియు యీచపలనయన। బ్రహ్మతేజంబు నీయందు బ్రజ్వరి
ల్లుఁ। బ్రజ్వరిల్లు బతివ్రతాపరమతేజ। మిూలతాతన్వి యందు మాకిందఱకును
భయ తేజంబులును మహాభ్యుదయ మొసఁగు॥ గీ॥ శక్రుఁడీతండు శిఖివీఁడు జముఁ
డీతండు। రాక్షసుఁడు వీఁడు పాథోధిరాజు వీఁడు। పవనుఁడీతండు కిన్నరపతి యి
తండు। వృషభవాహనుఁడీతండు విశ్వవంద్య॥ వ॥ వీరె మునులు వీరె సిద్ధసాధ్య
మరుత్కిన్నరకింపురుష గంధర్వవిద్యాధరులగు దేవయోనులు మావచ్చిన కా

ర్యంబవధరింపు వింధ్యంబనుమహీధరంబు విబుధశైలంబుతోఁ బ్రతిస్పర్థించి యూర్ధ్వాండకర్పరంబు నిజశిరశ్శృంగశృంగాటకంబులనుద్ఘాటించుచుననూరుసారథిరథంబవరోధించి నక్షత్రగ్రహతారకాచక్రంబుఁ జిక్కుపఱిచిన ప్రసమీరణస్కంధంబులనుం బ్రతిబంధించి శింశుమారాకారంబునం దారకావీథిఁ బవ్వళించినపాంచజన్యధరునోరసి యుత్తానపాదినుత్తరించి గగనగంగ నాలింగనంబుచేసియురులింగాకారుండైనధూర్జటిం ద్రివిక్రమాకారంబునవిరాడ్రూపుండగువిష్వక్సేను ననుకరించుచున్న యదిదుదినిమేషకాష్ఠా కళాముహూర్తాహోరాత్ర పక్షమాసర్త్వయన సంవత్సరయుగ సంధ్యాసంధ్యాంశ మన్వంతరకల్పమహాకల్పాది భేదభిన్నంబై పదార్థంబులం బరిచ్ఛేదించు కాలంబు నిరస్తసమస్తోపాధిక స్వప్రతిష్ఠాఖండ సచ్చిదానందైక రసాద్వితీయరూపుండైనవిరూపాక్షుండు దప్పించియన్యులంబరిచ్ఛేదించు నట్టికాలంబున కుందపవపరిస్పందంబుమూలంబుమార్తాండుండు కొండప్రక్కంజిక్కి కదలిమొగయుక్కలిందగులువడిజోగునుంబోలె నెదుఱునడవమరలంబఱవలేక చీకాకుపడియున్నవాఁడు ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్న సమయంబులు గత్తరఁగలసియుంటంజేసి నిత్యనైమిత్తికాదిక్రియాకలాపంబు లుపసంహృతంబు లయ్యెఁ బ్రాచ్యోదీచ్య దేశంబు లంధకారాతపహిమానిలంబులచేతం జేతనావైకల్యంబు వహించె భువనంబు వనకాండ ప్రళయంబా విర్భవించెఁ గల్పాంతకాలంబునందునుంగనుగందకుండుంగావున నవ్వేసవిఁగాశీక్షేత్రంబునందు నుపరతిచూపఁ డేమియునమ్మహోపద్రవంబునకుం బ్రశాంతిగోరియుబ్రహ్మణ్యంబుసేయుచు బ్రహ్మశరణుఁజొచ్చితి మవ్విరించి కరుణాకటాక్షంబునవీక్షించి యీయాపదయపనయింప వాతాపిహారితాపసుండుదక్కం దక్కినవాఁడు సమర్థుండుగాఁడతనిం బ్రార్థింపుఁడు పొండని తానసీకందువచెప్పిన నీయానందవనంబునకరుదెంచితిమిటమీఁదఁ గోపాటోపావికుంఠకలిత హుంకారధారావష్టంభంబునంద్రి విష్టపరాజ్యలక్ష్మీమదాంధుండైన నహుషుని నిమిషమాత్రంబున ధాత్రీమండలంబునం బడఁద్రోచినమహానుభావుండవునీవప్రమాణంబు॥

క॥ ఎవ్వఁడునిసర్గకఠినుం। డెవ్వఁడుసన్మార్గరోధియీర్ష్యాపరుఁడై। యెవ్వఁడు దనకధికునితోఁ। జివ్వకుఁజేసాఁచు వానిసిరులధ్రువముల్॥ వ॥ అనినవాచస్పతిపలుకులాకర్ణించి యమ్మునిపుంగవుండిట్లనియె॥ గీ॥ యత్న మొనరింతునీకార్యమనువుపడఁగ। జనుఁడుమీమీనివాసదేశములకర్థి। నున్నవాఁడుగవాపీఁడెయుమయుఁదాను। గాశికాభర్తమనపాలికల్పతరువు॥ వ॥ అనినవారునుమహాప్రసాదంబనిసముచితప్రకారంబునంగుంభసంభవునిపీడ్కొనినిజనివాసంబు

లకుం జనిరి యనంతరంబ యగస్త్యుండు లోపాముద్రం జూచి యిట్లనియె॥ గీ॥ క
మలలోచన మనుజుం డొక్కటిం దలంప । దైవ మొక్కటిం దలంచు నెంతయుని
జంబు। కాశిం బెడంబాయ ననియే నుగదలకుండం। గాశిం బెడంబాపె దైవంబు క
రుణ లేక॥ గీ॥ అప్పటికి నియ్యకొంటిం గాకంబుజాక్షి । ఋషుల పాలింటి వేయింత
లేసి పనులు। కొసరకాంబోతు నాంబోతు గుమ్మలాడ। నడిమి లేంబెయ్య దేసవ
చ్చె నాకు నిపుడు॥ సీ॥ వివరించి చూడంగ విసుమానములు గాక గోత్రారి వెఱ
చు నే కుధరములకు। యుగవిరామమునను నూర్జితలూపంగ జాలు గాలికొండ
దమియింపంజాల దెట్లు। సర్వభూతంబుల శాసింపంజాలెడు జములావు గిరియందు
జిటులువడు నె। దహనుని దాహకత్వంబు మహీధ్రసంస్తంభంబునకు శక్తిచాల
దొక్కొ। రుద్రులాదిత్య ఋషులు మరుద్గణములు। దక్కగల దేవతలు జగత్త్రి
యము భ్రమింగి। యుమియం జాలుదురట్టి వారోపలేరె। వింధ్యగిరిగర్వసంరంభ వి
ఘపపడంప॥ గీ॥ కామధేనువుం దనయింటం గట్టినాండు। గలవు దనతోంటలోన
లం గల్పతరులు। అట్టియింద్రుండు ప్రార్థించె నట్టినన్ను ।నింత పనికి యియ్యకొనకుం
డ నెట్లు నేర్తు॥ సీ॥ మాటనిల్కడం గాదె మధుకైటభులు ద్రొల్లి హరిచేతం జచ్చి
రేకార్ణవమున। గరుడుండు మోమోటం గాదె వాహనమయి వసజాక్షు నె
క్కించుకొని యేపింవు। సాకతంబునం గాదె చక్రాయుధుం డడంపం బాతాళబి
లములో బలియడంగె। విశ్వాసమునం గాదె వృత్రాసురేంద్రుండు సమసెనంబు
ధి వేలశక్రుచేత। మెఱసి యుపకార మొనరింప మేలు వచ్చుం । గీడు వచ్చు మనం
బులోనోడవలదు। వాండు చేసిన ధర్మంబు వానిం గాచుం। గీర్తి యొక్కటిసాల దే
కేవలంబ॥ చ॥ ప్రతిదివసంబు విందుము పురాణముఖంబునం గాశియందు సం। త
తముగ సంతరాయములు దాంకుచునుండు ననంగ నిప్పుడా । శ్రుతినిజమయ్యె నే
ని దెయశ్శోకమనస్కతనుండంగా నతి। క్కతగతి వచ్చెం జూడుమి దెక్కిన్న రకంఠమ
హాంతరాయముల్॥ గీ॥ విముఖుండయ్యెం జుమీ నాకు విశ్వభర్త । గాక యూ
రక యే భంగిం గలుగ నేర్చు।సకలకైవల్యకల్యాణజన్మనిలయ। కాశికాక్షేత్రవిప్ర
యోగవ్యథార్తి॥ గీ॥ పాణియాహారకబళంబు పాఱవైచి। కూర్పరము నాకు
నిలవెట్టి కూళవోలె। భోగమోక్షములకు జన్మభూమియైన । కాశివిడిచి చిన్నరుం
డన్య దేశమరుగు॥ చ॥ తటుకున నియ్యకొంటి మతిదప్పి మరుద్గురుండంత వాని
తో। నటమటమింకంబోక యుడి యాసలనుండుటం బాపు దైవమా । యిటువ
నుం జిక్కబెట్టు దెయనేకవిధంబుల నెట్లు చెప్పినన్। గటకట యెట్లు వాయనగు
గాశికె మోక్షపదప్రకాశికన్॥ సీ॥ పాయంగ వచ్చునే ప్రాలేయగిరికూటసమవ
ర్ణజలౌఘుజహ్నుకన్య। మఱువంగ వచ్చునే మందాక మధురసాస్వాదఘూ

గేఁతనేత్రుఁడటుకనాథు। విషువంగవచ్చునే విఘ్నాంధకారార్కుఁడుండివిఘ్నే
శుమంటపాకజరు।మాసంగవచ్చునే మధ్యాహ్నకాలంబు శ్రీవిశాలాక్షికెం
జేతిభిక్ష। సురలు ప్రార్థింపఁగాఁ బ్రతిష్ఠితముచేసి। యెట్టివోఁడుఁడ నేర్పుఁ నేనిం
తవాఁడ। నెట్టివోనేర్తుఁగాశిఁ బుణ్యైకరాశిఁ। బ్రకటగుణరత్న దుగ్ధాంబు
రాశిఁ బాసి॥ క॥ కాశీక్షేత్రము పంచ। క్రోశము గైవల్యలక్ష్మి కులగృహమని
యా। క్రోశించు శ్రుతులు వినియును। దేశాంతరమరుగ సమ్మతింతురభాగ్యు
ల్॥ గీ॥ కాశిఁ బాయుమఁగాకేమి కలువకంటి। యంతరవిముక్తతీర్థంబు నా
శ్రయింతు। నంతరవిముక్తతీర్థమెయ్యదియొయనిన। వరణయును నాశియును
నైనవారణాశి॥ వ॥ భ్రూఘ్రాణంబులసంధియ విముక్తస్థానంబది యభ్యంత
రతీర్థంబు తీర్థంబులు బాహ్యాంతరభేదంబుల ద్వివిధంబులైయుండు॥ గీ॥ ఎల్లవి
యు బాహ్యతీర్థంబు లిందువదన। యరయ బాహ్యంబులయ్యు నాభ్యంతరము
లు। కాశికాతీర్థమాదిగాఁ గలవు కొన్ని। వానివివరింతుఁ బరిపాటి వినిలవిను
ము॥ సీ॥ శిరమంబునందలి శ్రీశైలతీర్థంబు మల్లికార్జునదేవుమనికిపట్టు। స్థా
లభాగమునందుఁ బ్రాలేయమయమైన విమలకేదారతీర్థము వసించుఁ। గుచ
చూచుకములందుఁ గురుజాంగలక్షేత్ర తీర్థరాజము సుప్రతిష్ఠఁ బొందు। భ్రూవ
ల్లరీయుగ్మమునకు మధ్యంబున నానందవనతీర్థమధివసించు। నంతరంగమునఁ
బ్రయాగ మాశ్రయించు।నిమ్మహాతీర్థములు పార్వతీశ్వరునకు।విహారణస్థానము
లు పెద్దవిశ్రుతములు। వెలుపలను లోపలనునుండుఁ దలిరుబోఁడి॥ వ॥ బా
హ్యాభ్యంతరంబులయందును నవిముక్తతీర్థంబుత్తమోత్తమం బట్టి తీర్థం
బుననుండి యఖండంబు సచ్చిదానందైకరసంబున ద్వితీయంబునగు నిష్కళస్వ
రూపంబున నర్ధనారీశ్వరాదిరూపంబైన సకలస్వరూపంబునను విశ్వనాథును
పాసించి యుండఁగూడదయ్యెం గావున నింక నేను భావతీర్థంబున నభ్యుభవు
నుపాసించెద సంసారసాగరంబుఁ దరియింప సాధనంబగుటఁ దీర్థంబయ్యె నా
భ్యంతరంబైన యవిముక్తతీర్థంబు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల కుపలబ్ధిస్థా
నంబగుటం ద్రిమూర్తులకు సాధారణంబయ్యును మహేశ్వరునకుం బ్రధాన
స్థానంబై యుండు॥ సీ॥ ఏవిధంబున నాత్మ నెఱుఁగుదు నేనంచు యాజ్ఞవల్క్యు
నినత్రియడిగెఁ దొల్లి। యవిముక్తమునయం దుపాస్యుఁడాత్మఁ డటంచు యా
జ్ఞవల్క్యుండత్రికానతిచ్చె। నాయవిముక్తమెందాశ్రయించినదియం చడ
గెఁ గ్రమ్మఱ నత్రి యాజ్ఞవల్క్యు। నసువారవరణయందును నాశియందును నది
యుండు ననియత్రికానతిచ్చె। యాజ్ఞవల్క్యుండు భ్రూమధ్యమాస్థలంబు। వర
ణాసంసారదోష నివారణంబు। నాశియింద్రియదోష వినాశనంబుఁ। కేయు

చుండుటయిదినిర్వచింపఁబడియె॥ వ॥ అభ్యంతరావిముక్తక్షేత్రదర్శనంబు బ్రహ్మనాడీపవమానజయంబునంగాని సిద్ధింపదు॥ సీ॥ ప్రకృతిరూపిణియైన పాఁపపూఁబోఁడికి మహదాదివికృతులుమలక లేదు। మొగమువిచ్చిసుషుమ్న మూలరంధ్రముగప్పి వంకొస్థిసంబంధవళనలీల। నదిమీఁదుప్రాఁకి మధ్యమనాడితోఁగూడి ద్రుహిణరంధ్రముగప్పఁదోఁకచివరఁ। జక్కఁజాయఁజరింప సమకూరకుండుట నిడపింగళనుగారియెక్కుడిగ్గుఁ। గెలనివాకిళ్ళు రెండు వేగిరమ మూసి। నడిమివాకిలిదెఱవ నెన్నండునేర్చు। సాధకుఁడునాఁడుగాని వశ్యంబు గాదు। పవనవిజయంబువానికిఁ బద్మనయన॥ క॥ ఇడవామనాడిపింగళ। కుడి నాడిసుషుమ్నమధ్య గోచరయగుసీ। కుడియెడమమధ్యనాడుల। కుదురాజాననత్రిమూర్తులుఁ లాఁగి దైవంబుల్॥ క॥ హరియిడకునలువపింగళ। కరవిందదళాయతాక్షియమృతాంశుకళా। ధరుఁడుసుషుమ్నానాడికిఁ। బరిపాటినధీశులనుచుఁబలుకుదురార్యుల్॥ వ॥ పవనంబునకు సుషుమ్నాప్రవేశలక్షణంబైన యోగంబువివరించెద బ్రహ్మలోకప్రాప్తిద్వారంబగుట సుషుమ్న బ్రహ్మనాడియనంబరఁగు షణ్ణవత్యంగుళప్రమాణంబైన దేహంబునట్టనడుమఁ ద్రికోణాకారంబై కుక్కుటాండంబు చందంబుననుండునది కందస్థానంబు॥ గీ॥ నాభికందంబుక్రిందటనలినగంధి। కుండలీశక్తిదేవతయుండు నెలవు। కుండలీశక్తి నాఁగఁజకోరనేత్ర। పామునందాననుండెడు ప్రథమమని॥ వ॥ ఆదిమూలప్రకృతిమహదాదిప్రకృతివికారంబులేదును దానిమేని మలకలప్పఁపచేడియయు సుషుమ్నానాడితోడం జెనంగొనియుండు॥ క॥ గిటగిటనెనిమిదిమలకలఁ। గుటిలీభావముధఁజాచి కుండలిన్వాఁకర్ణ। నిటలాంతముదాఁకనుగ్రిం। దటిమొగమైప్రవేలునంత్రుతజ్ఞులుదాన్ని॥ గీ॥ దానిచుట్టునసుండు వేదలిరుబోఁడి। డెబ్బదియురెండువేలునాడికలుమేన। ముఖ్యనాడులువానిలోముద్దరాల। పదియు నాలుగుననుచుఁ జెప్పుదురుబుధులు॥ వ॥ ఇడానాడియందుఁజంద్రుండధివసించియుండుఁగావుననందుఁ బవనంబుద్గమించుకాలంబు రాత్రిప్రవేశించుకాలంబుపగలు పింగళానాడియందు సూర్యుండధివసించుఁగావున నందుఁబవనం బుద్గమించుటదివంబుప్రవేశించుటరాత్రి ప్రాఙ్ముఖస్థితుండగు పురుషునకుఁబింగళానాడి దక్షిణదిక్కున నిడానాడి యుత్తరదిక్కుననుండుఁ గావున మకరాయనసమయంబున దక్షిణదిగవస్థితుండగు సూర్యుండుఁగర్కటాయన పర్యంతంబునుత్తరాయణంబునడచుటంజేసి యుత్తరాయణంబయ్యె నీచందంబునం బింగళాస్థితుండగుపవనుండు యావత్కాలంబున నిడయందుసంక్రమించునం

తకాలంబు త్తరాయణం బీప్రకారంబున దక్షిణాయనంబు నెఱుంగునది॥ ఉ॥ స
మగతినేక కాలమున సంగతి యామవతీకళత్రుఁ డర్కుఁ। గమలహితుండు ప్రాణము
ను గాడ్పులు దారయి కూడి స్వంగళా। ధమని నిడాసితీవ్రగతిఁ దార్కొని క్రుంకుదు
ర స్తమింతురే। సమయమునందుఁ దాల్చునది చంద్రనిభాస్య యమాభిధాన
ముర్క॥ గీ॥ పాముకుండలి చంద్రుండు ప్రాణపవన। మాశిరోవల్లి యప్పుడయ్య
నిలుఁ గ్రోలు। నదియ శేషాంగకగ్రాసమైనయట్టి। గ్రహణకాలంబు సుమ్ము సా
రంగనయన॥ వ॥ ప్రాణంబ యాదిత్యుం డాదిత్యుండ చంద్రుం డా ప్రాణానిలంబ
మూలాధారప్రవేశానంతరం బుదయించు మూర్ధప్రవేశానంతరం బ స్తమిం
చు దేవతలకు మొదలివిషువంబైన మేషాయనంబున సూర్యుండుదయించువి
షువాంతరంబైన తులాయనంబున న స్తమించుఁ బ్రాణోదయా స్తమయ స
మయంబులు విషువద్వయంబు॥ చ॥ మొదల సుషుమ్నఁ జొచ్చు నిడ ముట్టిన
గాడుపు గొంత సేపువం। బిదప సుషుమ్నఁ బుట్టిన సమీరము చొచ్చు నిడాఖ్య
నాడికర్క। మొదలను భిమ్మటర్క బవనముల్ దిరుగంబడి చొచ్చుగానయ। య్య
దనులు సంక్రమంబులని యాడుదు రాగమతత్వకోవిదుల్॥ వ॥ అనియు విము
క్తక్షేత్రవియోగదుఃఖంబు మాన వంతర విముక్తక్షేత్రమాహాత్మ్యంబు పన్యసిం
చియనంతరంబ కాశికావిరహవేదనాభారంబు దుస్సహంబగుట సార్వశ్రేయుం
డు కాశీనిలక్ష్యంబు చేసి యిట్లనియె॥ క॥ అమచ్చికలాచనువా। ప్రేమాతిశయం
బువి స్తరింపఁగవశమే। త్వ్మామండలతిలకమపర। భూమికిని న్నెట్లు వాసిపోవు
దుకాశీ॥ మ॥ నిజమేఁ బల్కెద బాహులె త్తి శ్రుతివాణీజాహ్నవీదేవతా। ధ్వ
జినీడుంఠిగణేశ్వరుల్ గలుగవో వారాణశీదేవియో। గజచర్మాంబరుకూర్మిపట్ట
ణము యో కల్యాణినీర్ బోలనం। బుజగర్భాండమునందు లేవు నగరంబుల్ తీ
ర్థరాజంబుల్కక॥ గీ॥ లేవు లింగంబుల విము క్తలింగమునకు। సాటిసేయంగ
భూర్భువస్స్వస్త్రయమున। రావు దక్కటి పుణ్యతీర్థములు నీకు। సాటిసేయంగ
భూర్భువస్స్వస్త్రయమున॥ వ॥ అని యెట్టకేలకుం గదలి విరాలిం గొన్న చందం
బున మరులుగుడిచినపోల్కి నపస్మారంబె త్తినపగిది నన్నుకొన్నవిధంబున దూ
పటిల్లిన తెఱంగునఁ దూలపోయినరీతి విషంబెక్కినలీల బ్రమఁ గన్ను వెట్టినలా
గున లాహిరివట్టిన భాతి మదంబెక్కిన మాడ్కి నుంగటిగొన్న భంగి నొసరిల్లుచు
నుహ్వాను చును మ్మలించుచు నుదిలఁగొనుచు నుపతాపంబందుచు నూటాడు
చు సార్వశీనందనుం డూర్ధ్వబాహుండై యుచ్చైస్స్వరంబున॥ సీ॥ పరమ
కల్యాణియో భాగీరథీగంగ వార్ధిభామిని పోయి వత్తునమ్మ। యామరేంద్రులా
రలోలార్క కేశవులార వనజసంభవ పోయి వత్తునయ్య। శ్రీవిశాలాక్షి దాక్షి

న్యపుణ్యాకటాక్షవాసవార్చితపోయివత్తునమ్మ। శ్రీపూర్ణభద్రపారిషదనాయకులార వటుకభైరవ పోయివత్తునయ్య। తీర్థసంవాసులార కృతార్థులార పాశుపతులార భాగ్యసంపన్నులార। మందిరోద్యానవాటికావాసములార। పోయివత్తునెమీకాశీపురమువిడిచి॥ సీ॥ కలహంసిరారా దెకదలినాతోఁగూడినీవేలవత్తమ్మనెమ్మినుండి। కదళికాకాంతారకదలిరావనుఁగూడి నీవేలవత్తమ్మనెమ్మినుండి। శ్రీవిశాలాక్షివిచ్చేయునాతోఁగూడినీవేలవత్తమ్మనెమ్మినుండి। నాతోడఁగూడియంతర్గేహయేతెమ్ము నీవేలవత్తమ్మ నెమ్మినుండి।రండునునుఁగూడి రోపరిభ్రాట్టులార। వత్సలతగల్గి మీరేలవత్తురయ్య। పరమనిర్భాగ్యుఁడైననాపజ్జవట్టి। కటకటాసౌఖ్య జలరాశిఁగాశిఁబాసి॥ వ॥ అనియెట్టకేలకుఁగాశీనగరంబు వెడలి కొంతదవ్వు నడచి విప్రయోగ వేదనాదూయమానమానసుండై వదనంబువఱువట్లు వట్టంబాదంబులు గుదివడునుహ్వానుచునొక్కవట విటపినీడనజ్జటాధరుండు చతికిలంబడి లోపాముద్ర కిట్లనియె॥ గీ॥ భూమిపతిపుత్రిచెప్పుమాబుద్ధిమతివి। కాశివెడలఁగవలసెనేకారణమున। గారణములేక యూరకగలుగునెట్లు। సుఖముదుఃఖంబునరునకు సులభలీల॥ వ॥ కాశ్మీరంబులయందుఁగుంకుమంబునునది దేశాపేక్ష దినంబునంద కమలవికాసంబు రాత్రియందయుత్పలవికాసంబునది కాలాపేక్ష పుణ్యవంతునకు సుఖంబు పాపిష్ఠునకు దుఃఖంబునునునదియదృష్టాపేక్ష సర్వంబునునీశ్వరేచ్ఛాయత్తంబనునది యీశ్వరాపేక్ష విశ్వంబును గ్రహవశంబనునది గ్రహాపేక్ష మాకుఁజూడనీశ్వరప్రేరణంబునం గర్మంబు సుఖదుఃఖంబుల నాపాదించు నీశ్వరుండెవ్వనిరక్షింపవలసె వానిచేఁబుణ్యకర్మంబులు సేయించు నెవ్వనిం జెఱుపవలసె వానిచేఁబాపకర్మంబులు చేయించు నవిద్యాస్మిత రాగద్వేషాదిలక్షణక్లేశ పంచకమూలంబుగ పాకర్మాతిశయం బక్కర్మంబిహాలోకపరలోకంబులం బ్రాణులనుభవింతురు కర్మంబులకు మూలభూతంబైన క్లేశపంచకంబెంతగాలంబనువర్తించు నంతగాలంబు కర్మంబునకుం ద్రివిధంబు పరిపాకంబు నానావిధయోనిజన్మప్రాప్తియు నాయువు సుఖదుఃఖఫలోపభోగంబును జన్మంబును జన్మహేతు కర్మంబుచరితార్థంబయ్యె నేనియు నవశిష్టంబులనీ యాయుర్హేతువులు భోగహేతువులునైనకర్మంబులకు ఫలానురూపంబై నభాగ్యంబుపరమేశ్వరుండు గల్పించుచుండు॥ గీ॥ ఏమిచెప్పఁగనున్నది యేవిధమునఁ। గాశివెడలించుచున్నాఁడు [illegible]ళగళుఁడు। మనములోఁగతి మేనిలోఁగునె శివాజ్ఞ। యెుక్కుమువడికినవడుకు నేబడింతు సెట్టు॥ వ॥ అనివెండియు॥ సీ॥ వక్షస్థ్సలంబునవెచ్చుమంత్రము చెప్పిఁమిళిపాముల రాచ జన్నిదంబు। జడలల్లి చొల్లియుం

విడి మొకసకెముగా బాలేందుశకలంబు పదిలపఱచుఁ । గంఠమూలము
నందుఁగస్తూరివాఱుగాఁ గాలకూటవిషంబు గీలుకొలుపుఁ । గటిభాగమున
యందుఁగట్టురింగులువాఱ మెఱుఁగారుమువ్వన్నె మెకము తోలు । గట్టవా
లుపడంతి చక్కటికిఁ దోఁపఁ । దఱచుగాఁ సేయుచుండునాతల్లిగాళి । యయిదు
క్రోసులపొలములోసంతసంతఁ । జావకుండఁగఁబుచ్చనజంతువులకు ॥ చ॥ అ
నిమొనురుండి క్రమ్ముకొనయనాంబురుహంబుల బాష్పబిందువుల్ । చినుకఁగ
వెక్కివెక్కి కలశీసుతుఁడోయన నేడ్చుచీరెలుం । గునసొకకొంతసేపుమల్ గొ
బ్బునమిన్నులు మోవ నుద్ధుర । ధ్వనిఁబఱియింపఁజొచ్చెఁ బ్రణవంబునఁగూ
ర్చినమంత్రరాజముఁ ॥ వ॥ అచ్చోటుగదలి ప్రతిదినప్రయాణంబులవింధ్యాచ
లంబు డాయంజనుదెంచి విషమదృషత్ఖండవిలసనస్థలంబును జరత్తరుకోట
రజరరలుఠదజగరగళగుహానిష్ఠ్యూత నిష్ఠురపవన సంధుక్షమాణ దవదహనశి
ఖాకలాపంబును సుగ్రతరశరభచటుల చపేటపాతమోహిత కోలంబును న
ముద్ధత స్తబ్ధరోమకంఠకఠోరఘుర్ఘురధ్వాన ఘుమఘుమాయమానదిక్కుంజ
రక్రోడంబును గ్రీడించు చికోడ శిశుచరణ నఖశిఖాశిఖరకీర్యమాణ శిఖరశ్రే
ఫాలికా కుసుమ కేసర రజఃప్రసరధూసర వాసర కరకరవాతంబును బరుష
తరపవనబిలపతితపచేళిఘదధిఫలభక్షణపుల్లగల్లభల్లూకప్రకరంబునునగుమ
హాగహనమధ్యంబున ॥ సీ॥ యక్షరాజుఁదలంచి యక్షిగోళంబున నశ్రుపూర
మునించునర్మమిగిలి । పలుమాఱుమఱిదండ పాణిసౌహార్దంబు భావించిభా
వించి పలవరించు । సంభ్రమోద్భ్రిములవిశ్వాసపాత్రంబుల సావిదల్లులనర్థి
సంస్మరించు । దిగ్గజాఘోరసిద్ధివినాయకకపర్ది చింతామణిగణేశితులఁ బొగడు ।
జ్యేష్ఠసౌభాగ్యసుందరీ చిత్రకంఠ । వికటదుర్గామహాదేవి విశ్వబాహు । వాపి
కా దేవతిలనిజస్వాంతవీధిఁ । గాంచిగఱుదాల్చుసర్వాంగకములఁదపసి ॥ క॥ త్రి
ణయునునిరాణివాసము । నణిమాద్యైశ్వర్య వితరణామరతరువు । న్మణికర్ణి
కము త్రివధూ । మణికర్ణికఁదలఁచుఁదపసిమానసవీథిన్ ॥ సీ॥ కరవల్లిఁజటలిం
చుఁగరముసంశోధించుఁ బ్రాణోపనిష దభిప్రాయమరయుఁ । బరిపాటిమాండ
కోపనిషత్తుఁదాప నీ యోపనిష త్తనభ్యాసగమించు । ధరయునథర్వవేద శిరః
ప్రపంచంబు లారణ్యకముత్రోవ లరసిచూచుఁ । బ్రశ్నోపనిషదర్థపరిమళం
బుగ్రహించు శ్రీభగవద్గీతఁచిత్తగించుఁ । దలఁపఁగారంబు శ్వేతాశ్వతరమున
నెడు । నుపనిషత్తులుదలపోయు నొయ్యనొయ్యఁ । గాశికాక్షేత్రవిప్రయోగప్ర
భూత । హృదయసంతాప శాంతికై యుల్లలారి ॥ వ॥ అప్పుడు ॥ మ ॥ శ్రీతిపా
లోత్తమవంశభూషణము లక్ష్మీభారతీపార్వతీ । ప్రతిబింబంబుక మగ్రకాంతిమ

తిలోపాముద్రవీక్షించియు। వ్యథితముంబొందుచువింధ్యనాయక మహాభూమీ
ధరారణ్యాదే। వతలందండనమస్కరింతురు మనోవాత్సల్యమేపారఁగ॥ మ॥ న
లివింధ్యాచలకాననాంతరమున న్వారాణశీత్యాగవి। హ్వలభావంబున నిల్చి
నిల్చిహరనీహారాంశుమూర్ధన్యని। ర్మలకాశీశ్వరనీలకంఠయనుచుఁ బ్రమాఁగ
న్నువాటిల్లఁద। త్కలశీసూనుఁడు మూర్ఛఁగ్రైకొనుఁ గ్రమత్థామాత్మరోల్లా
పియై॥ వ॥ వెండియుఁగుంభసంభవుండు॥ చ॥ దురితములెన్ని చేసితినొతొల్లి
టిజన్మమునందుఁగాశికా। పురమునసర్వజంతువులు భూరివిముక్తులుగొల్ల వె
ట్టఁగా। హరహరనెత్తిఁజేతులిడి యశ్రులుగన్నులనుప్పతిల్లఁగాఁ।గిరినిభయా
నతోనిఠిపాకాలెద మిన్నులువడ్డచోటికిఁ॥ గీ॥ ఏలభ్రమింగితివాతాపినిల్వలు
నిని। ఏలత్రోచితి దివినుండి నేలనహుషు। నాప్రభావంబుగాదె నన్నదరిపా
టు। కాశివెడలఁగఁద్రోచె నిష్కారణంబ॥ సీ॥ ఎన్నఁడుచూతునోయింకొ
క్కమాఱేనుమహిమాస్పదముముక్తిమంటపంబు। నెన్నఁడుచూతునోయిం
కొక్కమాఱేనుబ్రకటకైవల్యంపురాశిఁగాశి। నెన్నఁడుచూతునో యింకొ
క్కమాఱేను జగదేకపావని జహ్నుకన్య। నెన్నఁడుచూతునో యింకొక్క
మాఱేనువిశ్వలోకాధ్యక్షువిశ్వనాథు। నింక నెన్నఁడుచూతునో యేనుడుంఠి।
నింక నెన్నఁడుచూతునో యేనుదుర్గ। నింక నెన్నఁడుచూతునో యేనువటుకు।నిం
క నెన్నఁడుచూతునో యేనుగుహుని॥ వ॥ అనుచునల్లనల్లనవచ్చు కుంభసం
భవునవ్వేదవ్యులఁగాంచి కాంచనశిరఃశృంగశృంగాటకంబులం గమలభ
వాండకటాహంబులుఘ్హాటించు తనమేనిపొడవు నేలసపాటంబుగావంచి విం
ధ్యాచలంబుమహానుభావు నెదుర్కొనియె నప్పుడర్కునిరథంబు చక్కఁజా
యునఁడచెఁ బవనస్కంధంబుల నిర్బంధంబులుడిగె నిందుండు చిందిలిపడసాగె
మంగళబుధబృహస్పతి శుక్రశనైశ్చర రాహు కేతువులుదమతమత్రానకంబు
లు దప్పకచరింపందొడంగిరి ప్రపంచంబుసర్వంబును యథాపూర్వంబునంబ్ర
వర్తిల్లెఁగాలంబులేర్పడియె ననంతరంబ పురుషాకారంబుదాల్చియజ్జగతీధరం
బు గొన్నిహాజ్జలుప్రత్యుద్గమించి॥ సీ॥ ప్రణవపంచాక్షరోప నిషత్పవిపంచం
బుకడదాఁక నెత్తిఁగినక అదలాని। వాతాపిదైత్యునిల్వలునితోఁ గూడంగజఠ
రాగ్నిఁ బ్రేల్చిన నవనకర్త। గోపించినహుషుని గుంభీనసంబుగా హుంకార
మిచ్చిన యుగ్రతేజ। వానకాలమునందువండువట్టిననీటి కాలుష్యముడిపినకత
కఫలము। బొందుభసితత్రిపుండ్రాంతఫాలభాగు। భద్రరుద్రాక్షమాలికా
భరితవక్షు। భార్యయునుదానునే తెంచుపరమశైవుఁ। గాంచెవింధ్యాచలేం
ద్రంబుకలశభవుని॥ క॥ కాశీనగరీవిరహా। క్లేశభవక్రోధవహ్నికీలలనాకా। కా

శధరిత్రీవలయము। లాశుగతిం గాల్పఁ గడఁగునట్టి మహోగ్రుఁడ॥ వ॥ కాంచియక్కుంభినీధరంబు కుంభసంభవునతిథిసత్కారసంభావనా విశేషంబులం బరితోషంబు సంపాదించి కరాంభోరుహంబులు మొగిడ్చి మహానుభావా నీయాజ్ఞాప్రసాదభావంబున ననుం గృతార్థుం జేయుమని పలికిన॥ సీ॥ వింధ్యాచలేంద్రపృథ్వీభృత్కులశ్రేష్ఠ దక్షిణాపథము తీర్థంబులాడఁ। బోవుచున్నార మీపూర్వబోఁడియు నేను బెద్దగాలమునాఁటి పెరువగాన। లావుచాలదు జరాక్లైబ్యంబు కతమునఁ బోడ వెక్కనపు డుడిగెడునపుడును। నభ్రంకషములైన యాశిరశ్శృంగాగ్రశృంగాటకములిట్లు చిఱుతపఱచి। యనఘ నేఁ గ్రమ్మఱఁగ వచ్చునంతదాఁక। నుండవలయు ధరిత్రిలో నొదిగి నీవు। చేయునాయాజ్ఞ లెస్సగాఁ జేయకున్న। నెత్తెఁగెదవు గాక యజ్ఞాడ నేల యిపుడు॥ వ॥ అనిన వింధ్యంబు మహాత్మా చరాచరంబైన జగంబునందు నీయాజ్ఞఁ జేయనివారును గలరె నీవు మరలి విచ్చేయునంతదాఁక నిట్లయుండెదననినఁ గుంభసంభవుండతని దీవించి నిజపాదాంభోరుహవిన్యాసంబుల విశ్వంభరాభాగంబు భాగ్యవంతంబు గావించుచుఁ దక్షిణదిశాభిముఖుండయి చనియె నని చెప్పిన నైమిశారణ్యవాసులటమీఁది వృత్తాంతం బెయ్యది యనుటయు॥ ఉ॥ బలవద్బ్బరహాదోంతిమన్నిధరణీపాలావరోధాంగనా। విలసన్మంగళసూత్రరక్షణకళా విఖ్యాతకారుణ్యయు। త్కళకర్ణాటతురుష్కరాట్పురమమిత్రాకుండలి స్వామికుండల పూజాపరతంత్రధీవిభవపంట క్ష్మాపచూడామణీ॥ క॥ భూపాలమథనజంబూ। ద్వీపేశ్వర విమతరాయ వేశ్యావిటధా। టీపటహాధ్వాన్ననాదా। టోపప్రక్షుభితదిక్కుడుంగక్రోడా॥ ఉత్సాహ॥ బంధులోకపారిజాత పంటవంశపావనా। సంధివిగ్రహప్రధాన షడ్గుణావిశారదా। గంధవాహ భుక్కలాప కంఠకోణనాభిని। ర్గంధనక్రియామహా ప్రగల్భకీర్తివైభవా॥

గద్య * ఇది శ్రీమత్కమలనాభ పౌత్ర మారయా

మాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీనాథ నా

మధేయ ప్రణీతంబైన కాశీఖండంబను

మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము,



## కాశీఖండము - తృతీయాశ్వాసము.

శ్రీమద్దేసటివంశ । గ్రామణిమూర్ధాభిషిక్తకంఠీరవసు । త్రామనిభ వైభవోన్నత। భీమాపాంచాల వీరభద్రనృపాలా॥ వ॥ అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లనియె॥ ఉ॥ ఆపృథివీధరంబు హృదయంబున సంతసమందె నెంతయున్। గోపనుఁ డెల్లకాలమును గుంభభవుండతఁ డివ్వడుగ్రుఁడై । శాపవిశప్రయోగమునఁ జంపఁదలంచిన నద్దిమెవ్వర । స్థాపకశైలమిప్పటికి శంకవహింపకయుండుఁ గావుతన్॥ వ॥ అనికుంభసంభవుని ప్రత్యాగమనంబుగోరుచు వింధ్యాచలంబవంధ్యోదయంబై వసుంధరా గర్భంబున నడంగియుండె॥ గీ॥ మునిజబాధారిశివభక్తిఁ దనఘుమ్మూర్తిన్। యెవ్వఁడే తెంచునప్పు డత్తెత్తి చూచుఁ। గుంభసంభవుఁడను కోర్కి కొనలుసాగ। వసుమతీధరము నేఁ డేలవచ్చు దురలి॥ గీ॥ మొదలిపెక్కువయునుబోయి మునిఁ గెనద్రి। కలశజుని నేత్రమునఁ గాంపుగానసైన। నొరుని మైశ్వర్యమీక్షించి యుపతపించు। నట్టిఖలునకునది పెద్దయానతలఁప॥ క॥ సిద్ధింపవీప్సితంబులు। సిద్ధించిన వెనిసిపిదపఁ జెడునన్యునిసం। వృద్ధియుఁ గనుఁగొని యెంతయు। బుద్ధినసూయాగ్రహంబుఁ బొందునతనికిన్॥ గీ॥ అప్రయోజనమభివృద్ధి నతిశయిల్లు। నప్రయోజనమడఁగుఁ గాలాంతరమున। నకటయీగ్రహగ్రస్తుఁడై నయట్టి। ఖలుని సంపదవిభవ చన్నులును బోలె॥ వ॥ ఆసమయంబునం బాకశాసనపావక పరేతరాడవేలలాశివపవన పౌలస్త్యపశుపతులు పరమహర్షోత్కర్షంబున నగస్త్య మహర్షిం బ్రస్తుతించిరి పతంగుండును బసిండికొండ నెత్తంబు చక్కటి వియత్తలంబున నడవం దొడంగె॥ సీ॥ స్ఫటికభూములయందుఁ బ్రతిబింబములు చూచి యితరాశ్వబుద్ధి హేషితమొనర్చుఁ। బద్మరాగోపల ప్రస్థభాగములందు జనసంధ్యాశంక జాడ్యమందు । మరకతమణిశిలామధ్యంబునందు దృశ్యాదృశ్యమూర్తులై యలమసూతు। నైదూర్యమణిమయ వప్రాంతరములందు సలిలాభిలాష సౌదలులు వాంచుఁ। గిన్నరస్త్రీలఁ జూచి లంఘింపఁ బాఱు। గావరంబెత్తి యుద్ధామ కామవికృతి। వాయుజవములరవితేరి వారువములు। వేల్పుగుబ్బలి ప్రస్థవీథియందు॥ సీ॥ తమతనుచ్ఛాయ మేఘములవచ్చనివన్నె నుభయపక్షములునై యూఁగియాడఁ। గల్యాలఁ దెగిన సృక్వములకొ

న్నెత్తురులాసనంబులకుఁ గొంపోవహింప। నుడుపథంబునయందునుండి నగలిఁ
దారిగమన వేగంబునఁ గానఁబడఁగ। శుకముఖద్విజకోటి సులభకౌతూహల
వ్యతిషంగమునఁ జేరియనుచరింపఁ। జిలుకలును బోలె హేమాద్రిశిఖరశృంగ।క
ల్పవృక్షాటవీ వాటికలఁ జరించె। మహీధరము నేయునంకిలిమానుటయును। వన
జవన బాంధవుని తేరివారువములు॥ సీ॥ ఆకాశవాహినీ సైకతంబుల ఖురాంచల
టంకములుఁ గ్రుంగఁజిట్టులపడిన। శోనకుంభాచలస్థపుటస్థలంబున వజ్రాభిహతి
వడివాలకున్న। బహుళదూర్వాశంకఁ బ్రణత దేవకిరీట మరకతద్యుతులకై మ
రులుకొన్న। నిందుబింబముఁ జూచి చెందుపచ్చగలు సావి యాఱులెత్తి నాకంగనా
సపడిన। బసిఁడిగిలుకల చేరోఁకాలఁ బరిఢవించి। కఠినహుంకార మొనరించి కన
కరథము వారువంబులఁ బఱపె దుర్వారలీల। బిరుసుటహాతహా వినువీథిఁ బిచ్చ

—*(అగస్త్యుఁడు దక్షిణకాశికి బోవుట.)*—

కుంటు॥ వ॥ ఇవ్విధంబున సంభవనోపద్రవంబు ప్రశాంతిం బొందించి దక్షిణకా
శీసందర్శనంబునం గాని కాశీవియోగ వేదనాభారంబు డిందుపడదని డెందంబు
ననిశ్చయించి మందమంద ప్రయాణంబులం గొందలి రాకుఁ బోఁడింగ సుగందకుం
డముందఅపి అందనడపించుచు నెడనెడఁ బుణ్యవాహినీతీర్థంబులఁ గ్రుంకులు
పెట్టియుష్టసురార్చనభ్యర్చించుచుం గొన్ని వాసరంబులకుఁ గుంభసంభవుండు
గోదావరి నొరసికొనుచు నాంధ్రదేశంబున నరుగునప్పుడు॥ మ॥ అహరారం
భములందుఁ బ్రస్రవణశైలాధిత్యకా కందరా। కుహరక్రోడకటాహ గద్గదన
టద్గోదావరీసింధువార్లహరీశీకర మాలికాశిశిరముల్ పంపానఖుల్ దండకా।
గహనగ్రాహులు వాయువుల్ దపసికిం గల్పించెనాహ్లాదముల్॥ గీ॥ ఋషికిఁ బం
పానరోపీ చిప్పుమత శిశిర। గంధవాహ ప్రవాహసంబంధములును। గాశికాక్షే
త్రవిప్రయోగప్రభూత। తాపశాంతి యొనర్పంగ నోపవయ్యె॥ సీ॥ పట్టసశ్రీవీరభ
ద్రేశు సేవించి తిలసోమనాథునం ఘ్రిలకు నెరఁగి। పురశాసనుననంతభోగేశ్వర
స్వామి హిమశైలకన్యకాన్వితుఁ గొల్చి। పద్మాద్రిపై రుద్రపాదంబులర్చించి చే
రిమార్కండేయు శివుభజించి। కోటిపల్లి తీర్థకుండలాముఖముల నర్ధేందుధరువి
రూపాక్షుఁదలఁచి। పల్వలస్థానమున భూతభర్తనిలిపి। కొంతమునవృద్ధగంగ
నుఁగ్రుంకు పెట్టి। దక్షవాటికసప్తగోదావరమున। మునిఁగి భీమేశ్వరునిఁ గాంచె
మునివరుండు॥ తే॥ పాశికకాలము తీవ్రభానుఁడు దయింపక సప్తగోదావర।
బోశికపూరమునన్మునింగియుభవుల సోమార్ధచూడామణిం। జ్యోతిర్లింగము
నస్వరూపుఁ గొలిచెన్ శుద్ధాంతరంగంబునం। బాతివ్రత్యమహాప్రభావనిధి
లోపాముద్ర భీమేశ్వరున్॥ కు॥ మునిచూడామణి యొల్లసత్కుశలకున్ మూర్ధా

భిషిక్తుండుగా । పునర్భూరికరణాంగహారములు తావులెన్మెచ్చి కీర్తించుచుండ॥
శనివారోత్సవవేళఁ గన్గొనియె నాస్థానంబునం దా రాజనం । దనయుం దానును దేశి
మార్గమున గంధర్వాప్సరోనృత్తముల్॥ అంత॥ గీ॥ కుంభజుఁడు దక్షిణాభి
ముఖుండగుటయు। నదను వీక్షించి వచ్చెనో యనఁగవచ్చె । శంబరారిప్రతా
పాగ్ని సామిధేని। నవశరద్వేళ శ్రీభీమనాథుఁ గొలువ॥ గీ॥ జిగురు కొన్నరజని
స్ఫూర్తిఁ జెఱకుమోసి। జలదకుంభోదకంబున జలకమాడి। మలయుజాచ్ఛప
యోధరమండలీల। దిగ్వధువులందు శుచిప్రవర్తించెనినుఁడు॥ సీ॥ అభినవో
న్మేషదివ్హాంబై నతోలుచూపు కౌస్తుభాలోకరేఖలకునలఁగ। సాంగభంగం
బై నయనాపులింతకు వేల్పులంగుళిస్ఫోటంబులాచరింప। సౌఖశాయనికులై సం
వర్తభృగ్వాదిమునులు అస్తాంభోజములు మొగుడ్ప । ధృతచేతనంబులై ది
వ్యాయుధంబులు జయజయధ్వనులతో సంస్తుతింప। నలరు జేకులు వోని పెంజిలు
వ తేని। యురఁటికుబుసంబు పొరలు మైనంటియుండ। నిదుర మేల్కాంచి కూర్చుం
డెను వధీనను మా। విష్ణుఁడఖిలేశ్వరుఁడు శరద్వేళయందు॥ వ॥ వెండియుఁ బాకవ
శవిశీర్ణ దిశాశల్మలీగుల్మతూలరాశి దేశీయంబులు వియమరగనిర్మోకశకలవి
భ్రమంబులు సభ్రమువతిశరీర శుభ్రంబులనగు సితాభ్రంబు లభ్రంబునం బరి
భ్రమించి ఖండఖండంబులై యాఖండలకోదండంబుల గగనమండలంబు నలంక
రించెఁ గొదమ మొగుళ్ళు దెరలును దడంబడు వలుదవడగండ్లు పుష్పాంజలులు
నుఱుమువప్పళ్లు మర్దళధ్వనులుగా గగనరంగస్థలంబున గ్రొమ్మెఱుంగుఁగొం
డ్లి పరిధవించె మత్తవనమయూరమత్తకాశిని సకలమధురకంఠ కేకానీతికావ
సానంబునం గళాపించెఁ గుంభద్రోణంబులం భోధరంబులు గురిసి వెలిచిన యనం
తరంబ యంతంతనుట్టిపడు నట్టు సలిలబిందువులునుం బోలె రజనీశు క్తికముక్తాఫ
లంబున నక్షత్రంబు లంతరిక్షంబున సంప్రేక్షణీయంబులయ్యె దాక్షారామకట
కాప్సరస్తటంకినీ వదనారవిందలావణ్యబిందునిష్యందంబు చందురుండు కంద
ర్పదిగ్విజయకీర్తిస్ఫూర్తియుం బోని యచ్చ వెన్నెలవిచ్చలవిడింగా యుండా
డంగెఁ గుముదంబులు ముదంబుదె లాంగలి చెంగలించె తెల్లులసిల్లెఁ గాసరగాఁ
చె దోసదోరగిలం బారెఁ బయ్యెర విసరె వారివండలివోఁ గరిమదంబు గురిసెసం
దిపోతుపోతరించి ఖణిల్లునటం కెవైచె నసలదు గుపడియె నెఱనిసుకదిబ్బ చూ
పె నిద్రించవియయ్యె సేడాకులపొన్నకొన్ని నఁ బెరిగె వరిగ వెరిశా గసగసమెసఁక
మెసఁగెఁ జెసరుసురుకొని మెదవవికపొదలె తెక్కు ప్రాసంగు దొండముక్కు ప
డియె మదకలకలహంససారసకలాలాపకోలాహలవ్యాజృంభితకకుభంబులై వి
హారవేశంతంబులం గాంతా కుచద్వయద్వయసవారి పూరవంతంబులయ్యె న

త్యునపరంబున॥ సీ॥ కార్తికేక వేళభీమశంకరునిసగర । వింధ్యసంస్తంభయిత
దూతెవిమలబుద్ధి। దొయ్యలియుఁదానుజిచ్చులతోరణంబు। కలుషసంహా
రిసంహారకారణంబు॥ క॥ దక్షిణవారాణశియగు। దాక్షారామంబుసాధ్చిత
రుణోదు ధర్మ। వీక్షించినగోలెనుగా। క్షేత్రాలోకసుఖముచేకుజెబుషి
కీ॥ క॥ క్లేశంబును సౌఖ్యంబును। నాశువునుగుంభజన్ముఁ డభిమర్శించెం।
గాశీవిరహముదక్షిణ। కాశీసంగమమువరుసఁగలిగినకతన॥ వ॥ పరోపకారప
రుండయినవానికిఁ బుంఖానుపుంఖంబు సంపదలు సంభవించుఁ దీర్ఘస్నాన
దానజపహోమదేవతార్చనాదులు పరోపకారంబునంబోలసేరవు పరోప
కారంబుకంటె ధర్మంబు లేదు లోకోపకారపరాయణుండైన వాతాపితాపసు
నకింత లేసిప్రయోజనంబులు సమకూఱకుండునె యివ్విధంబున భోగమోక్షని
వాసంబయినదాక్షారామంబునం గొన్నిదినంబులుండి కొల్లాపురంబునకు శ్రీ
మహాలక్ష్మిఁ దర్శింపంబోఁదలంచియున్న మైత్రావరుణి॥ సీ॥ అంతఃప్రవాహిన్యై
యావిర్భవించెనే ధరణీధరముపొంతతల్లి బావి। పారెనే శైలంబుపాదమూలం
బునగల్లేటితో వృద్ధగంగవాసి। యుదయించెనే కొండయుత్తరాశారసాతలకు
క్షిస ప్తగోదావరంబు। జనియించెనే శిలోచ్చయముదక్షిణమునఁ గణ్వవాహి
నియుప్పగడలిక్రొమ్మ। పద్మగిరితోడఁబుట్టువేపర్వతంబు। బలిసియుండునె యా
ద్రికిఁబంచలింగి। యట్టివీరభద్రాఖ్యమహాచలమున। కరుగుదెంచెనువింధ్యమ
దాపహారి॥ వ॥ ఇట్లరుగుదెంచి లోపాముద్రకిట్లనియె॥ గీ॥ దక్షిణానందవిపిన
మధ్యంబునందుఁ। గ్రతువిధిధ్వంసవేళ దేవతలనటికి। వీరభద్రేశుఁడీయద్రిని
న్నుఁదన్ని। గౌతమీ వారిఁదొరవారిఁ గడిగినాఁడు॥ గీ॥ పంకజాక్ష్యాధరమువీర
భద్రగిరియు । సంధ్రభూమికి వక్షోరుహద్వయంబు । భువనచతుష్కరంబమం
భోరుహాక్షి। గౌతమీగంగముత్యాలకంఠమాల॥ సీ॥ ఎవ్వాఁడుడాచేతి క్రొ
వ్వాఁడినఖమునఁజిదిమె భాషాదేవి చిగురుముక్కు । గనకమేఖలగ్రుచ్చికట్టె
నెవ్వఁడులీలఁ జెలఁగుమైఁ బూపొర్కుమెఱుంగుపండ్లు। కోరకెవ్వఁడుపదాం
గుష్ఠభాగంబున నుసురాజు పొట్టగుజ్జుఱుకనూఁదెఁ। దత్తిగనెవ్వఁడుఖడ్గధా
రాంచలంబున నగ్నినాలుక లేడునంటఁబట్టె। మోదెనెవ్వాఁడుముప్పదిమూఁ
డుకోట్లు। వేలుపులఁ బారబార వెన్వంటఁదగిలి। యట్టిశ్రీవీరభద్రుఁడీ యద్రి
మీఁద। భద్రకాళియుఁదానుండుఁ బద్మనయన॥ గీ॥ బ్రహ్మసంవేద్యమాది
గాఁబట్టిసాంత। మతివగోదావరీనదీహారమునకు। నడుమనాయకరత్నమైనలువు
మిగులుఁ। బంచలింగాశ్రయము వీరభద్రశిఖరి॥ వ॥ అనిచెప్పియచ్చోటుగదలి
ప్రతిదినప్రయాణంబుల॥ క॥ క్షీరారామంబునఁ బ్రా। చ్యారామంబునను నా

దివ్యాకారా మనమునం। ధారాధిపచూడామణీ। నారాధించెను మునీంద్రుఁడతివ
యుఁడానుఁ॥ వ॥ అనంతరంబ యమ్మునిసింహుండు సహ్యగిరికన్యకా ప్రవా
హంబునఁ గృతావగాహనుఁడయి కదలి పశ్చిమాంభోధితీరంబున సౌరాష్ట్రసో
మనాథేశ్వర శిరశ్చంద్ర చంద్రికాధౌత కలధౌత సౌధవీథికాసముల్లిఖితగగన
మండలంబయి పను నెనిమిది యోగపీఠంబులందును సుప్రసిద్ధంబయిన కొల్హా
పురంబున పంచనియుండు॥ ఉ॥ శ్వేతవరాహకల్పమున వెన్నుఁడు సూకరవేష
ధారియై! యంతరదంష్ట్రికాంకురమునందు ధరిత్రి వహించి యుండఁగా। నా
తనిమీఁద లేఁతపాలయుల్క వహించి తొలంగి వచ్చెనో। యీతరలాక్షియంబి
ద్రుబుధులెవ్వతె నాజగదేకమాతృకఁ॥ గీ॥ భద్రకాళికయై ఖండపరశుధారఁ।
గోలయై తన్ను నీఁబోరిగొన్న ఘోరమూర్తిఁ। శౌరివక్షస్స్థలీనభశ్చంద్రరేఖ। శ్రీ
మహాలక్ష్మి నభక్తిఁ వీక్షించె దపసి॥ క॥ కొల్హాపురిలక్ష్మికిఁ బ్రణ। మిల్లిరిపుల
కాంకురములు మీసుల బొడమఁ। హృల్లేఖామంత్రోపని। షల్లతికా కుసుమము
నకు సతియుం జతియుఁ॥ వ॥ అనంతరంబ కుంభసంభవుం డాత్మగతంబున॥

—*( అగస్త్యుఁడు లక్ష్మినిస్తోత్రము చేయుట. )*—

సీ॥ శ్రీకోదకన్యకుఁ శ్రీమహాలక్ష్మికిఁ గమలాయతాక్షికిఁ గంబుగంఠికకు
లలోకేశ్వరి కామాన్నయవినుతకుఁ గనకకేతకిపుష్పగర్భగౌరి। కరుణాధరోష్ఠి
కినమరకోటికిరీట కోటివిటంక సంఘాటఘటిత। రత్నాంకురప్రభా రాజినీరాజి
తశ్రీపాదపద్మపీఠోపకంఠ। కంబురుహనాభు దేవికి నాదిశక్తి। కిందిరకు లోక
మాతకు నిగురుబోఁడి। కలరువిలుకాని తల్లికిఁ బ్రార్థితార్థ। కల్పవల్లికిఁ బ్రమొక్కెదం
గఁగంటిమంటి॥ అనియనంతరంబ॥ గీ॥ చందురునియందు జ్యోత్స్నవు చంద్రవ
దన। ప్రభవు భాస్కరునందుఁ బద్మనయన। దాహశక్తివి పావకుండ దహనునం
దు। ప్రమొక్కెద నునికుఁ గల్యాణమూర్తి లక్ష్మి॥ గీ॥ బ్రహ్మవృట్టించుమమనుఁను
నారాయణుండు। హరుఁడు హరియించు భువనంబు లవసరమున। నెట్టునమ
కూలువీరికి నీప్రభావ। మీశ్వరఁగలుగంగఁ బట్టికాకిందువదన॥ ఉ॥ పండితుఁడా
తఁడాతఁడు ప్రభావనముగ్రుఁడతండు శూరుఁడాతండు వివేకియాతఁడు వదాన్యుఁ
డతండు మహాకులీనుఁడా। తండుకళావిదుండతఁడు ధన్యుఁడతండు మనోజ్ఞమూ
ర్తియౌ। వ్వానుభవత్కృపాకలనవైభవలక్ష్మి నీకిఁ బాత్రమిందిరా॥ చ॥ పురు
షునిభార్యయందు మునుబొల్తుకయందు విలాసరేఖయుం। గరిహరులందుఁ బ
క్షిభుజగంబులయందు మహీరుహావళిం। హరితతృణాదులందుఁ బసులందును జె
య్యలయందు టెక్కెలం। దరుడుగఁ జెప్పనొప్పు భవదంశవిశేషము సూవె
యుందిరా॥ గీ॥ కమలనయనసీవు గలచోటు సరసంబు। నీవులేనిచోటు నీరసంబు।

కంబుకంఠనీవుగలవాఁడుకలవాఁడు। లేనివాఁడునీవులేనివాఁడు॥ సీ॥ పరిపూ
ర్ణహేమకుంభములుహస్తంబులధరియించి యిరువంకఁగరులుగొలువఁ బ
గళమైపరశంఖపద్మమహాపద్మమకరాదినిధులు సేమమునఁగొలువ। వింజామ
రలుదాల్చివెనుకదిక్కున దేవగంధర్వగుహ్యకాంగనలుగొలువ। నెలవంకఁబ
లువంకనింద్రాదిదివిజులు సేవాంజలులుమౌళిఁజేర్చికొలువ। ధర్మపంకజకర్ణి
కాభద్రపీఠి। కాగ్రమునునిండుకొలువుండియఖిలలోక। రక్షణముసేయుని న్నే
నుబ్రస్తుతింతు। ననమసౌభాగ్యగుణధన్యయబ్ధికన్య॥ వ॥ పరమార్థవస్తువిచా
రముసేయునచ్చినశక్తిమంతుండయిన యీశ్వరునకుశక్తియగునీకుభేదంబులే
దుగావునశక్తియుక్తుండయినయీశ్వరునకుఁగలసృష్టిస్థితిసంహృతితిరోభావా
నుగ్రహరూపంబులయిన కృత్యంబులయిదునునీయనువిధహానునకు దాహశ
క్తియునుష్ణాంశునకుదీధితియుఁ జంద్రునకుఁజంద్రికయునుంబోలె నీశ్వరునకు
నీవుసహాయభూతవవునై యుండు దిహజన్మజన్మాంతరంబుల విహితంబులయిన
వ్రతదానాదులచేతసంచితంబులయినదురితంబులు నిరసింపంబడుటంజేసి సత్వ
రజస్తమస్తనులయినయుత్తములు విశుద్ధసత్వులయినీతత్వంబు చింతింతురు
భోగాపవర్గలక్షణంబయినఫలంబు పరమేశ్వరుండు పశుగణంబున కిచ్చున
పుడునిన్నుమున్నిడికొనియీఁజాలండు శబ్దబ్రహ్మంబుకారణంబు బిందాత్మ
కంబై నిష్పందతత్వంబునకుం బురుషేచ్ఛాప్రయత్నంబున మూలాధారావస్థిత
పవనసంధుక్షణంబునంజేసి యభివ్యక్తంబై పరావాక్కనంబడు నాబ్రహ్మం
బీనాభిపర్యంతంబావాయువుచేతనభివ్యజ్యమానంబయినమనంబుతోడంగూ
డి సామాన్యస్పందప్రకాశరూపిణియుఁ గావ్యబిందుతత్వాత్మకయునీశ్వరాధి
దేవతయునునై పశ్యంతీవాక్కనంబడు నాబ్రహ్మంబావాయువుచేత హృద
యపర్యంతం బభివ్యజ్యమానంబై నిశ్చయాత్మకబుద్ధియుక్తంబై విశేషస్పం
దరూపయునాదబిందుమయియు హిరణ్యగర్భాధిదేవతయునై మధ్యమవా
క్కనంబడు నాబ్రహ్మంబాస్యపర్యంతంబావాయువుచేతనకంఠాదిస్థానంబుల
యం దభివ్యజ్యమానంబై యకారాదిక్షకారాంత వర్ణమాలారూపంబై ని
శ్చయాత్మకమై శ్రోత్రగ్రహణయోగ్యంబై వైఖరీవాక్కనంబడు నీచతుర్విధ
సూక్ష్మస్థూల మాతృకాస్వరూపవైట్టి దేవినీకునమస్కారంబు॥ గీ॥ అనినుతిం
చినఁబ్రియము మందియబ్ధికన్య। కలశజునిఁజూచియిట్లనుఁ గారవమున। ననఘనీ
స్తోత్రమునకునాయాత్మమెచ్చె। నీవుగోరినవరమిత్తునెమ్మివినుము॥ వ॥ ఇంక
రాఁగల యిరువయితొమ్మిదవద్వాపరంబున నీవు వ్యాసుండవై వారణాశిపు
రంబున వేదపురాణసంహితా ధర్మశాస్త్రంబు వక్కాణింపంగలవాఁడవు ఇప్పు

డొక్కమహిత్వంబు సెప్పెదఁ దుంగభద్రాతీరంబున గిష్కింధాచలోపాంతంబు
న స్వామిమలయను కానసంబునఁ గుమారస్వామివసించియున్నవాఁడు నీవచ
టికరిగి యతనివలనవారణాశీస్థానమాహాత్మ్యంబువినుమని పలికి లోపాము
ద్రంగనుంగొని యక్కాంతకు ముద్రికాకటకహారకేయూరాదులగు దివ్యా
భరణంబులు ప్రసాదించె నివ్విధంబునఁ గొల్లాపురలక్ష్మిచేతఁ బ్రసాదంబువడ
సి దంపతులు చరితార్థులయి సముచితప్రకారంబున నమ్మహాదేవిపీడ్కొని స్వా
మిసులకుం జనువారై కొన్ని పయనంబులరిగి ముందటఁ గట్టెదుర పరిణతి
దశావష్టంభంబయి సంరంభసముజ్జృంభమాణహేరంబదశనకులిశకోటిభిద్య
మానహాటకకటకఝాంకారఘట్టితతారాంగణంబై చతుర్ద్వారంబులను జతు
రంతరచతుష్పథద్వారంబుల షోడశగవాక్షంబుల ద్వాత్రింశన్మకరతోరణంబు
లఁ జతుష్షష్టినాట్యకూటంబులఁ బంచాశదుత్తరసహస్ర దీర్ఘికలను శతస
హస్రకోటిలింగంబులను దశసహస్రకోటిశక్తులనుం గోటితీర్థంబులనుంగలి
గివరాహకుండ మల్లికారకుండ క్షీరకుండాది కుండంబులచేతనుం గదళీవనబ
దరీవనగౌరీవన బిల్వవనాది వనంబులచేతను హాటకేశ్వర గుప్తమాహేశ్వర
నందిమండల నివృత్త్యాదులయిన దివ్యస్థానంబులచేతను వనసిద్ధి రసాయనసిద్ధి
మూలికాసిద్ధిపాదుకాసిద్ధ్యాదులగు సిద్ధక్షేత్రంబులచేతనుశోభితంబై దివ్యా
మృతనిర్మల శ్రీస్వయంభూజ్యోతిర్లింగమూర్తియగు మల్లికార్జున మహాదే
వునకు నివాసంబై యభిరామంబగు శ్రీశైలంబుచేరవచ్చె నయ్యవసరంబున॥
మ॥ పరిరంభంబొనరించెఁ గుంభభవునింబాతాళగంగాంబుని। ర్ఝరకల్లో
లఘుటాదృషద్వ్యతికరప్రాలేయముల్ హాటకే। శ్వరజూటీకృతమాలకేసర
రజస్సౌరభ్యసుపన్నముల్। గరివక్త్రాశిఖరణాహిపీతపరిముక్తంబుల్వనీవాయు
వుల్॥ శా॥ ఆమిత్రావరుణాంశసంభవుని వింధ్యాటోప విధ్వంసిలో। పాము
ద్రానహితుంగనుంగొనిరి యుత్పన్నప్రమోదంబునన్। వ్యామగ్రాహ్య ప
రిహాంకరల్ కుటిలనీలాగ్రాలకల్ తథ్యమి। ధ్యామధ్యస్థితమధ్యలాటవిక సేనా
ధీశసీమంతినుల్॥ సీ॥ వాతాపిదమనుండు పాతాళగంగయం దఘమర్షణ
స్నానమాచరించె। హాటకేశ్వరదేవు నారగ్వధంబుల నర్చించె వింధ్యదర్పా
పహారి। గగనస్పర్శివృషభుండు కంఠీరవానను వైకుంఠబిలమధ్య వాసుఁగొలి
చె। నేకాంతరామేశు నిందుశేఖరునిదర్శించె నీవారముష్టింపచుండు। గూ
ర్మరంభోరువును నాను గుంభభవుఁడు। కుంభినీధరదుహితృవక్షోజశాత। కుం
భకుంభద్వయీపరి రంభణార్తు। శంభు శ్రీమల్లికార్జునిసంభజించె॥ మహాస్ర
గ్ధర॥ యమిహృల్లేఖాదిమంత్రాభ్యసననిరతుఁడై యోగమోక్తప్రకార। క్ర

మయుక్తిగంధప్రహ్వాక్రతదళముల శ్రీకంఠునర్ధాంగలక్ష్మి నర్చి। భ్రమరాంబా
దేవినంతర్భ్రమరఫలభరప్రహ్వచూతద్రుపఙ్క్తి। శ్రీమహాకాళీ హేమసింహాస
నవిలసదధిష్ఠానసర్చించెనిర్జర॥ గీ॥ చెలువయునుఁదాను శాకటిబిలసహస్ర।
మార్గశాఖోపశాఖలమానివరుఁడు। విధుకిరీటులఁబూజించె వెదకివెదకి।
యమృతమయలింగమూర్తులనధికభక్తి॥ వ॥ వెండియునయ్యల్వలమథనుం
డు తుథావిధిమద్యాశకుండంబునం గ్రుంకి పంచాక్షరీమంత్రసిద్ధుండు పంచ
ధారాపల్లధారలను నిర్ఝరప్రవాహంబులం గృతావగాహనుండయ్యెఁ బా
టలజటాకిరీటుండు హాటకకూటశిఖరశృంగశృంగాటకాఖేటంబులఁ గోటిలిం
గంబులం భజించె లోపాముద్రాధిపతియద్రికటకభద్రాసనంబున సమున్ని
ద్రప్రతాపముద్రావిధృతాక్షుద్రోపద్రవుఁడగు నుద్యానవీరభద్రు శ్రీద్రవహా
రిద్రాక్షతంబులభద్రదారుద్రుహారి భద్రద్రుమత్సారకంబులనారాధించె బ్ర
హ్మర్షిబ్రహ్మపాదారవిందద్వంద్వంబుహరిచందనచర్యాముచర్చికలనర్చిం
చె సిద్ధతాపసమూర్ధాభిషిక్తుండు ఘంటాసిద్ధేశ్వరునివలన మంత్రసిద్ధి వడసె
మహాభాగుండు భోగవతీతీరంబున భోగేశ్వరు భోగాపవర్గప్రదు భుజంగభూ
షణు భజించె నీవారముష్టింపచుండిష్టకామేశ్వరునకుంబటిష్ఠనిష్ఠావిశేషంబులం
దుష్టింగావించి భువనగుప్తమాతృకలఁదలంచె నహూషమథనుండుమహితస
కలకలుషంబగు కదళీవన విషమభువనిగమాభవశ పరిషదనుగత వృషభ గమ
నుంగపటశబరవటు నచలదుహితృపరివృఢు నశఠమతింగొలిచె ననంతరంబ
యొక్కవివిక్తప్రదేశంబున సుఖాసీనుండై॥ గీ॥ అర్థిఁగుంభోద్భవుండిట్టుల
నియొసతికిఁ। బద్మలోచనచూడు శ్రీపర్వతమిది। పాయకిందుండుఁ బార్వతీ
ప్రాణవిభుఁడు। మల్లికార్జునదేవుండు మదనవైరి॥ గీ॥ ధవళలోచన శ్రీపర్వతం
బుమహిమఁ। బ్రస్తుతింపంగశక్యమే బ్రహ్మకైన। గండశిలలెల్లశంభు లింగం
బులిందు। సిద్ధమునులిందుఁ జరియించు చెంచులెల్ల॥ క॥ చాకున్న నీదుముక్తు
ల। శ్రీకాశీక్షేత్రమెవ్వరికి నేనిక్కం। బీకుధరమిచ్చుశిఖరా। లోకనమాత్ర
మునముక్తులుల్లసిలంగా॥ వ॥ అనియొనప్పుడులోపాముద్ర ముద్రికామణిమ
యూఖరేఖలునఖశిఖరంబులం జిగురొత్తవిద్రుమప్రవాళంబుల యుల్లాసంబు
నుల్లసంబాడు పాణిపల్లవంబులు మోడ్చి ఫాలభాగంబునంగీలించి వినయవిన
మితోత్తమాంగయైయున్నం గనుంగొని సస్నేహంబును సబహుమానంబు
నుసానురాగంబును సాభిప్రాయంబును సవిభ్రమంబును సోపాలంభంబునుం
గాఁగుంభసంభవుండు మహాదేవికిట్లనియె॥ సీ॥ హృదయంబులోసంశయించి
నిగూఢార్థమిదమిద్ధమనినిశ్చయింపలేక। యదితేటతెల్లఁగా నడుగంగఁద

లంచి లజ్జాసాధ్వసంబులు సందడింప । వదనప్రముఖపద్మ వయ్యున్న దానవు
ప్రాగల్భ్యసరణిం దేర్పడునో యాంచు। మాటాడ నేరనిమాడ్కి నంగవుసీవు సక
లకాలంబునో సరసిజాక్షి । కాంతయే కాంత వేళలు గాంతు నెదుర। నగుచుం దె
గడుచనుండుట తగవుసూవె। వలనిసిగ్గున వెఱపునం గలసి పెరసి । యుండకుం
డకుమాబోటులోర్వంగలరె॥ వ॥ అనినవిని లోపాముద్ర మానముద్ర దిగ
నాడి మునీంద్రునకిట్లనియె॥ సీ॥ చతురశీత్యాయామ సంపన్నమై యోజనో
చ్ఛ్రాయ వైభవాభ్యుదయమయ్యు। ముప్పదియోజనంబుల వెడల్పును గల్గి సార్ధ
త్రికోటితీర్థాన్వితమయి। సమధికాష్టాశీతి సాహస్రసంయమి జనసమాకుల
మయ్యు సప్తకోటి । మంత్రాశ్రయంబయ్యు ననుమహనీయమహిమమై తనరా
రుసీపర్వతంబునందు। శిఖరమీక్షించునంతన చేరునట్టి । ముక్తిజనులకు జీవన
ములుదొలంగ। జచ్చినప్పుడుగాని మోక్షంబులేని। కాశికరుగంగ నేటికిగా
ర్భుజాళి॥ వ॥ మఱికొందఱు కేవలవిజ్ఞానంబు ప్రశంసింతురు కొందఱువిజ్ఞాన
సముచితంబైన కర్మంబు సేవింతురు కొందఱు దానంబులు గొనియాడుదురు
కొందఱు వ్రతంబులు సెప్పుదురు కొందఱు యజ్ఞంబులు మెత్తురు కొందఱుతే
పంబులుగోరుదురు కొందఱుబ్రహ్మచర్యం బభినందింతురు కొందఱుగార్హ
స్థ్యంబుం బ్రస్తుతింతురు కొందఱువానప్రస్థాశ్రమంబు మన్నింతురు కొందఱు
సన్యాసంబుప్రసంగింతురుకొందఱు తీర్థసేవ యావిష్కరింతురు కొందఱు
స్వాధ్యాయంబునధికరింతురు కొందఱు కాశీశ్రీపర్వతాది శివస్థానంబులభ్య
ర్థింతురేనియు ముక్తిసాధనంబులయందులోన సులభంబగు ముక్తిసాధనం
బెయ్యది వినవలతు నానతిమ్ము సంశయబీజభూతంబులయిన యావిప్రతిప
త్తివచనసహస్రంబులు వినంగనాడెందంబు డోలాందోళనం బందుచుండు॥
క॥ అనియడిగినం గలశీసుతుం। డనుమోదరసార్ద్రహృదయుండై దేవికిని ట్ల
నునడుగవలయునర్థము। వనజాననయడిగి తు ముక్తివైభవములరా॥ శా॥ శ్రీశై
లాదులు ముక్తికారణములై చెప్పంబడుం దీర్థముల్ । ప్రాశస్త్యంబుననన్ని
తీర్థములకప్రత్యూహమై వర్ధిలుం। గాశీప్రాప్తికరంబులై సకలసంగైవల్యల
క్ష్మీదముల్ । గాశీక్షేత్రము గైకొనుందరుణిసాక్షాన్ముక్తిహేతుత్వముం॥ వ॥ ప్ర
యాగనైమిశంబు కురుక్షేత్రంబు గంగాద్వారంబవంతిక యయోధ్య మధు
రద్వారకసరస్వతీసహ్యంబుగంగాసాగరసంగమంబు కాంచిత్ర్యంబకంబు సప్త
గోదావరంబుగాలంజరంబుప్రభాసంబుబదరికాశ్రమంబుమహాలయంబోంకా
రంబుపురుషోత్తమంబుగోకర్ణంబుభృగుతీర్థంబుభృగుతుంగంబు పుష్కరం
బు శ్రీపర్వతంబునా నివి మోక్షకారణంబులైన మహాతీర్థంబులు॥ సీ॥ శంభు

ప్రసాదంబుసమకూఱకుండినఁ దీర్థయాత్రకుసమ్మతింపఁడాత్మఁ । దీర్థంబులా
డంగఁదివుటలేకుండినఁ బ్రతిబంధదురితంబువాసిపోదు । ప్రతిబంధదురితంబు
వాసిపోకుండినఁ గాశికేఁగెడునట్టికడఁకలేదు। శ్రీకాశికాపురక్షేత్రవాసములేక
విజ్ఞానవాసనవిస్తరిలదు। జ్ఞానమునఁగాని మోక్షంబుసంభవింప । దతిపజ్ఞానం
బనంగ వేదాంతవాక్య। సంభవంబైనయదియు యజ్ఞానమందు । రితరమజ్ఞాన
మీసూక్ష్మమెఱిఁగికొనుము॥ క॥ ధారాతీర్థంబనఁగాఁ । దారాధిపవదనఖ
డ్గధారాంచలము। ద్ధారాంచలమునఁ ద్రవ్వీన। వీరాగ్రేసరుఁడు ముక్తివిభవ
ముఁగాంచుఁ॥ గీ॥ తీర్థములుమానసములు ముక్తిప్రదములు। తరుణియివిమే
లు బాహ్యతీర్థములకంటె। మానవుండివియేమఱి మధురవాణి। బాహ్య
తీర్థంబులాడ నిష్ఫలమునూవె ॥ సీ॥ తీర్థంబుసత్య మింద్రియనిగ్రహము
తీర్థమనసూయతీర్థంబువనరుహోక్షి। తీర్థంబుదానంబుతీర్థంబుసంతో
ష మనుకంపతీర్థంబుకనకగౌరి। బ్రహ్మచర్యంబుతీర్థంబుతీర్థము ధృతిం
మముతీర్థమువిద్రుమాధరోష్ఠి । సమతతీర్థంబువిజ్ఞానంబుతీర్థంబు పుణ్యం
బుతీర్థంబుపుత్త్వబోఁడి। తీర్థములుమానసంబులు దేహశుద్ధి । యతిశయి
ల్లంగ నివియాడఁగాడినట్టి। పంచజనులకుఁ గలహంసపక్షిగమన । బాహ్య
తీర్థావలులు తీర్థఫలమునీవు॥ చ॥ బిసరుహపత్రలోచన కృపీటములందుము
నింగియాడవే। మొసళ్ళులుమీలుకర్కటకములగమఠంబులువానికబ్బునే।యు
సదృశమైనతీర్థఫల మట్టివిధంబునుమీఁతలంపమా। ననమగుతీర్థమాడని
జనంబులకుం బహుబాహ్యతీర్థముల్॥ గీ॥సుదతియేటికి నంతర్విశుద్ధిలేని।బా
హ్యసంశుద్ధి బహుతీర్థపరిచయమున। వేయిగడవలజలముల వెలిఁగడిగిన।
గలుగునేశుద్ధి వారుణీకలశమునకు॥ గీ॥ రాగద్వేషమలాపహర క్షమంబు ।
మానసంబైనతీర్థంబు మందగమన। యుపనిఁబంకరజో వ్యపాయక్షయంబు।
బాహ్యతీర్థంబు మేచకోత్పలదళాక్షి ॥ సీ॥ దర్శించినపుడచిత్తమునిర్మలం
ధనం బగుఁబ్రసాదగుణంబునందు నేనిఁ।గలుషంబుగానిదుర్గంధంబుబొరయని
సలిలంబునెరవుగాఁగల్గునేనిఁ। బావనక్షేత్రపుణ్యావనీధర తపోవనసన్నికర్షం
బుదనరునేని। సంశితవ్రతులైనసంయమిశ్రేష్ఠుల యధికపరిగ్రహంబబ్బునేనిఁ।
దీర్థమదిదక్కఁగలయది తీర్థమగునె। ధవళలోచన సలిలమాత్రమునఁజే
సి । ముదితదేహమునందంగ మొలకఁబోలెఁ। దారతమ్యంబుగలదు తీర్థ
ములకననీ॥ వ॥ సారంగనయన తీర్థాంగంబులం బ్రతిగ్రహం బనహంకారంబ
కోపనత్వం బనాలస్యంబు సూనృతంబు సమాధానంబు శ్రద్ధాధానత్వంబు స్వే
తస్థనిక్షేత్రోపవాసంబు పితృతర్పణంబు బ్రాహ్మణభోజనంబు పితృశ్రాద్ధంబు

పిండప్రదానంబు శిరోముండనంబు మొదలుగాఁగల యావి సాంగోపాం
గంబులయి ఫలంబులీఁజాలు మఱి తీర్థతారతమ్యంబు వివరించెద॥ సీ॥ చెలు
వశ్రీగిరియందు శిఖరేశ్వరంబను శిఖరంబుఁజూచినఁ జేరు ముక్తి। కాంతశ్రీశైలం
బుకంటె వేగంబునఁ గేదారమీఁజాలుఁ గేవలత్వ। మంతకంటెను వేగమరవింద
లోచన యమృతమీనోపుఁబ్రయాగ తీర్థ। మాప్రయాగముకంటె నతివేగ
మునఁజేయు నపవర్గమింతిమహాశ్మశాన। మతివయానందకానన ప్రాప్తికరము।
లఖిలతీర్థంబులును సందియంబులేదు। కాశికాతీర్థ మాడక కడియరాదు।
లక్ష తీర్థంబులాడిన మోక్షలక్ష్మి॥ వ॥ ఈయర్థంబు దేఁటపడ నొక్క
యితిహాసంబు సెప్పెదవినుము మధుర యనుపట్టణంబున శివశర్మయనువిప్రో
త్తముండుగలం డతండు వేదంబులు సదివి తదర్థంబు లెఱింగి ధర్మశాస్త్రంబు
లుపఠించి పురాణంబులధిగమించి యంగంబులభ్యసించి తర్కంబులాలోడిం
చి మీమాంసాద్వయంబాలోకించి ధనుర్వేదంబవగాహించి యాయుర్వే
దంబు విచారించి నాట్యవేదంబుగ్రహించి యర్థశాస్త్రంబులు పరిశీలించి
మంత్రశాస్త్రంబులు దెలిసి భాషలుగఱచి లిపులు నేర్చి యర్థంబులు పార్జిం
చి ధర్మంబులు చేపట్టి భాగ్యంబులనుభవించి పుత్రులనుత్పాదించి వారిక
ర్థంబు విభజించియిచ్చి యౌవనంబుపోకకు ముదిమిరాకకు శోకించి వ్యాకు
లుండయి నిజాంతర్గతంబున॥ శా॥ నానాశాస్త్రములభ్యసింపను ననంతద్రవ్య
మార్జింపను। దానంబుంబడయంగఁబుత్రులకు నర్థంబుల్విభాగించియిఁ।
బౌనఃపున్యమునన్ సుఖంబనుభవింపం బోయెఁగాలంబు గౌ। రీనాథున్భజి
యింపనేరనయితిన్ శ్రీకాశికావల్లభున్॥ సీ॥ కొలువంగ లేనైతిఁ గోపాలకృష్ణు
నిఁ నర్చింపలేనైతి హస్తివదను। మ్రొక్కంగ లేనైతి మునిజనశ్రేణికి సేవింపలే
నైతిఁ జిత్రభాను। యజియింపలేనైతి నమరసంఘాతంబుఁ బూజింపలేనైతి భూ
దివిజులఁ। గట్టింపలేనైతిఁ గమలకాసారంబు నిలుపంగలేనైతిఁ దులసివనము।
పేరటాండ్ర నర్చింపఁగనేరనైతి। సలిలసత్రంబు సాగింపఁజాలనైతి। నాజ్యతిల
హోమవిధులు మంత్రాన్వితముగ। హుతవహునియందుఁ జేయంగనోప
నైతి॥ గీ॥ పురుషసూక్తము శ్రీసూక్తమును జపింపఁ। బావమానిజపింపఁదత్ప
రతమీఁజ। నర్ఘిశతరుద్రియంబు పంచాక్షరంబు। ప్రణవమంత్రంబు జపియింపఁ
బ్రతిదినంబు॥ క॥ ఈహర్మ్యము లీతురగము। లీహేమములీభుజిష్య లీధాన్య
ములీ। దేహమునాతోవచ్చునె। యూహింపఁగఁ బుణ్యకర్మ మొక్కటిద
క్కన్॥ సీ॥ పాడిదగ్గుకంఠంబు పోరిపుచ్చకయున్న తలపులికంపంబుఁ బొంద
కయున్న। బొమలుకన్నులమీఁదఁ బొదివివ్రాలకమున్న పారనేత్రము

కన్నుచూరకమున్న । శ్రుతిపుటంబులశక్తి సురిఁగిపోవకమున్న వళులాననమునఁ
బర్వకయుమున్న । హృదయంబులో జాగపడనుదప్పకమున్న గాత్రంబుశిథిలం
బుగాకమున్న । పండ్లు వేఱ్వాసి కదలుచూపకయుమున్న । కాకిఁదడకంటిపైఁ
జూపురాకమున్న । కాలుచెయ్యాడుతఱి యందకదలవలయుఁ । దీర్ఘసేవకుఁ
బ్రాణమస్థిరముగాన ॥ వ॥ అని తీర్థయాత్రాపరుండై యిల్లువెడలి రెండు
మూఁడుపయనంబులకోలఁది తెరవున నొకవటవృక్షంబుక్రిందఁ బరిశ్రమాప
నోదార్థంబువిశ్రమించి యంతరంగంబున నిట్లనివితర్కించె॥ మ॥ కరికర్ణాం
తవిలోలమాయువు శరత్కాదంబినీచంచలా । తరళంబాత్మపయస్తరంగచ
లము ల్తారుణ్యము ల్తీర్థముల్ । పరిపాటింజతురంతధాత్రిఁ జరియింపన్వచ్చు
నేర్పైననేఁ । బురముల్నాలుగుమూఁడు ముక్తిజనకంబుల్మన్నువీక్షించెద॥
గీ॥ ఉజ్జయినికాశిమాయ యయోధ్యకాంచి । మధురద్వారకయనెడు నామ
ములుగలిగి । పట్టణములేడు కీర్తిసంపదవహించు । మహితకైవల్యలక్ష్మికి
మందిరములు॥ వ॥ అనినిశ్చయించి॥ సీ॥ సాకేతమునకేగి సరయూతరంగిణి
నభిషేకమొనరించి యధికభక్తి । నల్పుదెల్పును నైననదులకూటముప్రయా
గాఖ్యంబునందు దేహంబుఁదోఁచి । గంగలోమణికర్ణికా తీర్థమునయందు
సంకల్పపూర్వంబుగ్రుంకుపెట్టి । కైవల్యకల్యాణఘంటాపథంబైన యానంద
విపినంబునాశ్రయించి । తీర్థదైవతకోటిఁ బ్రార్థించిపలికి । యఖిలమును నాచ
రించి తీర్థాంగకములఁ । తీర్థములయందు శ్రీమహాదేవుఁగొలిచెఁ । భా
వనాచారనిరతుండు బ్రాహ్మణుండు॥ సీ॥ బ్రహ్మలోకోన్నత ప్రాసాదనిశ్శ్రేణి
యాజవంజవభీతి కభయపాణి । కలుషకంఠచ్ఛేదకాలాయసకృపాణి కైవల్య
నవమూర్తికమునకాణి । ధీరావనీసమధిష్ఠితాంతర్వాణి చతురుత్సవగంధసార
సరణి। చేతఃప్రసాదలక్ష్మీవిహారక్షోణి కల్పాంతకాలంబుగలపురాణి। పరమ
కల్యాణియాపగాంభస్త్రివేణి। రాజరేఖావతంసు గౌరావురాణి । సమధిక
ప్రీతిదేవియా సత్యవాణి। గేవలత్వశుభశ్రేణి గ్రేణివట్టు॥ గీ॥ అఖిలతీర్థంబు
లనునాడి యవనిసురుఁడు। గోర్కిమైఁబుణ్యాలతుమ్మలఁ గొల్లవెట్టు। నటువిశే
షించి గంగాప్రయాగతీర్థ। మధికతాత్పర్యనిష్ఠతో నాడఁదొడఁగె॥ సీ॥ వై
కుంఠమునసుండివచ్చి వైకుంఠుండు దేవీసహాయుండై తీర్థమాడు । గోలోక
మునుండిగోమాతృకలువచ్చి తీర్థమాడుదురతిస్థిరమనీషఁ । గాశికాపురి
నుండికాలకంఠుఁడువచ్చి దివసంబుదివసంబుదీర్థమాడు । వరుసదిక్కులనుండి
వచ్చిదిక్పాలురు త్రిదశేశ్వరాదులాడుదురుతీర్థ । మమరగంధర్వసిద్ధవిద్యా
ధరర్షి । గరుడకిన్నరయక్షరాక్షసపిశాచ । భూతములుదీర్థమాడు వేఁ

భోకచిపురః। బూమమకరస్థుఁడైనయప్పుడు ప్రయాగ॥ * * * *

వ॥ అది ప్రజాపతిక్షేత్రంబు యాగంబులకంటెను బరిశిష్టంబగుటం జేసి దానికిఁ బరియాగపమాహాత్మ్యంబన్వర్థనామంబై యుండు మార్తాండుండు మకరరాశిస్థుండయియుండ మాఘమాసంబున మధువమణిశిలాశకలంబుల విసర విస్ఫురకిరణసందోహసందేహదానదీక్షా ధురంధరంబులగు కాళిందీ సింధుకబంధంబులతోసంధించి కర్పూరగంధసారతారహారనిర్ఝరాహారనీహార క్షీరధారాశ్రేణిపాణింధమంబైన సౌరసైంధవ ధవళవాఃప్రవాహంబు ప్రవహింప సితాసితచ్ఛాయాచ్ఛటాగుచ్ఛ వ్యతికరంబునంజేసి మోక్షలక్ష్మీ కటాక్షవీక్షణంబునుంబోని యమ్మహాతీర్థరాజంబునం గ్రుంకి బ్రాహ్మణుండుకృతార్థుండయ్యె వెండియు॥ గీ॥ కాశికేతెంచు మఱిప్రయాగమునకేగుఁ। గాశికేతెంచు మఱిప్రయాగమునకేగు। మునుఁగు మణికర్ణికాతీర్థమునను మఱియు । మునుఁగు మణికర్ణికాతీర్థమునను మఱియు॥ శా॥ కింపుర్వాణ పురందరాదిక మహాగీర్వాణకోటీకిరీ। టాంకస్థాపితనూత్నరత్నరుచి ధారాశ్లేషకిమ్మీరప। త్పంకేజాంఘ్రిహరుండుజంతువులకుం బ్రాణాంతకాలంబునం। దోంకారాక్షరమంత్రరాజముచెవిన్ యోజించుఁగాశీస్థలిన్॥ గీ॥ కర్ణికాంతము సేరియేకతమశివుఁడు। మునుపుమోక్షచింతామణి జనునకిచ్చుఁ। గానమణికర్ణికా సమాఖ్యతవహించె। నమ్మహాతీర్థ మమరగంగాంతరమున॥ క॥ ఉద్భిజ్జములు జరాయు। పోద్భూతములండజాతములు స్వేదజముల్। తద్భూమండలిఁజచ్చిన। హాద్భుతముగఁబుట్టు హాలహాలకంధరులై॥ గీ॥ ఎడమప్రక్కయి కాశిలోనిల్గునట్టి। మశకశిశువున కోంకారమంత్రరాజ। మభవుఁడుపదేశమొనరింప నమరకోటి। నిగ్గువడుచుండుఁ దమవృథాజీవములకు॥ చ॥ కటకటకాశికాపురి నొకానొకనిద్దుకఁగన్నుమోడ్చియు। పుటఁగనువిచ్చునప్పుడుడిభాగముఁగన్గొని చోద్యమందుఁదా। పటిదెసఁజూచియచ్చెరువు పాటువహించుమనస్సరోజనం। పుటమునవాఁడులాగు మగపోఁడిమియుంగలజంతుసంతతుల్॥ మ॥ గృహమేధిప్రవరుండువిప్రుఁడమృతక్షేత్రంబువారాణశిన్। దుర్హీణక్షేత్రమువాసిపోవఁదలఁచెన్ దూరంబుగావెండియున్। మహిఁగైవల్యతఁదీర్థముల్గలిమిసంభావించి శాస్త్రజ్ఞతన్। బహుధానిపత్తివత్తిఁ విషయముల్ పాడైనశాస్త్రార్థముల్॥ సీ॥ ఆనందవిపినపుణ్యానుభావాధిక్య మెఱుఁగఁడాతానేమియెల్లదియును। తెలియఁడాతానేమి దేవలోకారోహ నిశ్రేణియగుగంగనిత్యమహిమ। మణికర్ణికాతీర్థమాహాత్మ్యవిభవంబుఁ జూడఁడాతానేమిసూక్ష్మదృష్టి। వరయఁడాతానేమియామ్నాయములఁ బురాణేతి

హాసములవ్విశేషగరిమ । నకటనానాప్రమాణాంతరానువృత్తి । నుదకము
న్నతభూమిపైనుండలేక। పల్లమునకోడిగిల్లినపగిదినతఁడు। కదలెఁదీర్థాంత
రమునకుఁగాశినుండి॥ వ॥ కదలికతిపయప్రయాణంబుల॥ సీ॥ ఏపీటిశృంగారి
యెలదోఁటలోనుండుఁగదల కెప్పుడునీలకంధరుండు। ప్రతియుగంబునను నేప
ట్టణంబునకునుదివ్యాభిధానంబుదిరుగుచుండుఁ। జేనంటఁజేనంటశివలింగము
లుగోటిసంఖ్యనేపురమునఁజాలనొప్పుఁ। గల్పాంతవేళనేకటకంబుమునుఁగదు
నింగితోరాయుమున్నీటివెల్లి। నట్టిమహిమలయుజ్జనికరుగుదెంచి। కాళిదర్శిం
చిశ్రీమహాకాళుఁగొలిచి। యుండెశివశర్మహరరాజయోగపరత। నిఖిలముక్తి
లకచోటునెలవుగాన॥ గీ॥ హాటకేశ్వరుఁడుమహాకాళనాథుఁడు। దారకేశ్వ
రుండుదలిరుబోఁడి। యీదకలింగములయియున్నారుపాతాళ। మర్త్యనాకభు
వనమండలముల॥ ఉ॥ కందవుగాజుపాఅవువికారమునొందవుపూతిగంధముం।
జెందవువాఁడవప్పురము సీమల నెల్లెడవామకర్ణముల్ । క్రిందుగదీర్ఘనిద్ర
లధరిత్రిశయించినజంతుదేహముల్। సుందరియిట్టిచోద్యములుసూడముతక్క
నతీర్థభూముల॥ క॥ లీలమహాకాళమహా। కాళమహాకాళయనుచుఁగదు
భక్తిమహా। కాళస్థానాధీశ్వరుఁ। గాళగళుఁ సంస్మరింపఁ గాంతురెధన్యుల్॥
గీ॥ భవుమహాకాళుసేవించిబ్రాహ్మణుండు। గదలెఁగాంచికినక్కాంచికాపు
రమునఁ। గలికివేడుకకత్రిశ్రీకామకోటిఁ। గవయునేకామ్రనాథునిఁగరిగిరీశు॥
ఉ॥ కంచికిఁబోయిబ్రాహ్మణుఁడుగాంచెమదావళభూమిభృచ్ఛిరశ్శి। కాంచన
కంధరానిలయుఁగైటభమర్దనుఁగామకోటిద। ర్శించెభజించెబాలశశిశేఖరు
నేకరసాలనాయకు । న్దంచెనతండనేకజననంబులఁబుట్టినపాతకౌఘముల్ ॥
సీ॥ ముడువంగనేతురుమూలదాఁపటికిరాఁ జికురబంధములీఁగఁ జీరునారఁ।
బొన్నపువ్వులఁబోలుపొక్కిళ్ళుబయలుగాఁ గట్టనేతురుచీరకటిభరమునఁ।
దొడువంగనేతురునిడువేలుఁజెవులందు నవతంసకంబుగానల్లిపువ్వు। పచరిం
పనేతురుపదియారువన్నియ పసిఁడిపాదములిలఁబట్టువెంపఁ। బయ్యెదయు
సిగ్గుఁబాలిండ్లఁబ్రాఁకనీక। తెఱచుపూయుదురోడలగంధంపుఁబసవు। బందిక
త్తెలుసురతప్రపంచవేళఁ। గంచియువతలసమాత్రఖడ్గలతలు ॥ గీ ॥ కంచి
యందురుగొందఱక్కాంచిపేరు । క్రమకురువిందరత్నసుకాంతిదంతి। యవ్వు
రంబుననేకునాళ్ళధివసించి। బ్రాహ్మణుఁడుసర్వదేవతాప్రతతిఁగొలిచె॥ వ॥ అం
దుండిప్రభాసక్షేత్రంబుమీఁదుగాఁజని॥ క॥ ద్వారవతీనగరంబున। గోరికశివ
శర్మయుండికొన్నిదినంబుల్। నారాయణపుణ్యకథా। పారాయణుఁడయ్యెఁబర
మ భాగవతులతోఁ॥ గీ॥ ధవళలోచనయొక్క చోద్యంబువినుము। ద్వార

వతియందుఁజచ్చినవారియొడలి। యస్థిశకలంబులందంతరాంతరములఁ। దన
రుశ్రీపాంచజన్యసుదర్శనములు॥ ఉ॥ కాంచనకేతకీకుసుమగర్భదళోదరసాదర
ప్రభా। భ్యంచితమైపటీరఘుసృణాగురుసౌరభలక్ష్మితోఁబిసా। ళించుచుఁగ
మ్మనై పరిమళించుసముజ్జ్వలగోపిచందనం। బించుక వేడ్కతోడధరియింతు
రుభాగవతోత్తముల్వరి॥ గీ॥ రమణిధరియింత్రుసూర్ధ్వపుండ్రములు నెఱియు।
ఫాలతలమునసవ్వీటిభాగవతులు। కలినపాపపరంపరకంఠనాళ। ఖండనప్రక్రి
యాక్రూరఖడ్గలతలు॥ సీ॥ కమనీయగోపికాగంధసారంబున నూర్ధ్వపుండ్ర
ములు బాగొప్పఁదీర్చి। వక్షస్థ్సలంబులవనజాక్షమాలికాచారునైపథ్యంబునం
తరించి। దక్షిణశ్రవణరంధ్రములఁగోమలకృష్ణతులసీప్రవాళంబులలవరించి। న
లినలోచనదివ్యనామసంకీర్తనాభంగికిజిహ్వలుపాలుపెట్టి। ద్వారవతియందు
ముక్తికాంతావిహార। మంటపమునందునుండ్రునిర్మలవివేక। నిరభిసంధికృపా
గుణనిర్ణిరోధ। పరమభాగ్యాన్వితులుమహాభాగవతులు॥ గీ॥ ప్రతియుగంబున
ద్వారకాపట్టణంబు। ముంచిరత్నంబులెల్లనుముచ్చిలించి। కొంచుఁబోయెడు
కలిమునఁగువలయాక్షి। యబ్ధికొడఁగూడెరత్నాకరాహ్వయంబు॥ సీ॥ కట్టు
రింగులవారఁగటిభాగమునయందుఁబసిఁడికెమ్మలపచ్చపట్టుచేల। వక్షస్థ్సలం
బునవనమాలధరియించుఁగౌస్తుభగ్రైవేయకమునఁగూర్చి। సేసకొప్పునఁజు
ట్టిశిఖిపింఛరింఛోళి మక్కళించినజల్లుమఱుఁగుపాగ। గొజ్జంగిపూసీరుగులికి
మేదించినకమ్మకస్తురి మేనఁగలయనలఁదు। ద్వారకాపట్టణముపొలిమేరసీమఁ।
గాలవశమునసిల్గితక్షణమునందుఁ। గైటభారాతిసారూప్యగరిమఁగన్న। కీటప
క్షిసరీసృపక్రిమికులంబు॥ ఉ॥ ఆపృథివీసుపర్వుఁడుప్రియంబునద్వారకయందుఁ
దీర్ఘనేసి। వాపరతంత్రుఁడై యయిదువాసరముల్వసియించిపోయెమా। యా
పురికమ్మహానగరమంబుజపత్రవిశాలనేత్రదు। ప్పాపముపూర్వజన్మమునఁ
బాపము సేసినమర్త్యకోటికి॥ వ॥ ఆనగరంబునుగొందఱు హరిద్వారంబం
డ్రుకొందఱు మోక్షద్వారంబండ్రు కొందఱుగంగాద్వారంబండ్రవ్వాఁడై ననిర్గ
మించికదాభాగీరథీభువనపావనిభవజటాజూటాటవీ వాటికాకుటజకోరకంబు
మున్నీటం బెక్కుముఖంబులంగలసినట్టిమాయాపురంబునందు॥ సీ॥ తీర్థోప
వాసంబుదీర్చిజాగరముండి తెల్లవాఱఁగనేటఁదీర్థమాడి। పితృతర్పణముఁజే
సిపిండప్రదానంబుయుపవస్తుచరువునాచరించి। యగ్నికార్యముదీర్చిహరుని
నభ్యర్చించిములు మోదుగాకులఁబులియగుట్టి। రాగిలోహండెనన్బ్రయిలే
కుండఁగవండిదింపనిప్పురువంటకంబు। కుడువఁగూర్చుండివడ్డించు కొనఁదలంచు।
నంతలోనశిరస్త్రోదమావహిల్లె। మేనుగఱుతాల్పెఁజలివచ్చెమెడలునొచ్చె। వేఁ

కెవలచూపెదాహామూవిర్భవించెవ॥ అంతశివశర్మనిజాంతర్గతంబున॥ గీ॥ బ్ర
తుకుమీఁదియాసపాయంగఁ బట్టితిఁ। జిచ్చువంటివేఁకివచ్చెనపుడ। జలధినట్టు
వసుమసాంయాత్రికుఁడుగలం। బవిసినపుడు ధనమునాశవోలె॥ సీ॥ ప్రతివాస
రముగృహారామనస్యక్షేత్ర పశుపీక్షణము సేయఁ బ్రాప్తుఁడెవ్వఁ। డిటమీఁద
నేభంగినిందుబింబాననవిఫలసంసారంబు వెడలఁద్రోయుఁ। దనయులింకేభంగి
ధనవిభాగములకై పోరితంబులు లేక పొసఁగియుందు। రఖిలపురాణేతిహాసశా
స్త్రాగమగ్రంథసంరక్షయెక్కడిదియింక। నకటమిన్నులువడ్డచోననదపోలె। ది
క్కుమాలినప్రేతనై తీరవలసె। శిరసుపై మృత్యువాఁడైడుశేవఁడంత। చావుని
శ్చయంబు బ్రతుకుటసంశయంబు॥ శా॥ సంతాపంబునఁబొందనేమిటికినీ సంసార
యాత్రావృథా। చింతాభారముపూనిజాతిఁదహనార్చిద్దాహముల్సాలవే।
చింతింతున్మదివిశ్వనాయకుశివున్ శ్రీకాశికాధీశ్వరున్। జింతింతున్ సరసీరుహా
క్షునిహరిన్ శ్రీద్వారకావల్లభున్॥ గీ॥ ఏలచింతింపనిహమునం దెల్లసుఖము
ననుభవించితిమధురామహాపురమునఁ। బరమునందువిముక్తిసంపదయుఁగలి
గె। నేడుపురములఁదీర్థంబులాడఁగనుట॥ వ॥ అనివితర్కించుచుండ॥ శా॥
పాటిల్లెన్ ధరణీసురోత్తమునకప్పాటన్ విదాహజ్వరో। ష్ణాటోపంబునసత్యుప
ద్రవముమైనాపాదమస్తంబుగాఁ। గోటీవృశ్చికకీటపుచ్ఛలతికాకోటీశిఖాకం
టక। త్రోటీకుట్టనసంప్రభూతవిషమాదుర్వారదాహార్తిన్॥ క॥ తన్నె
ఱుఁగకెదిరినెఱుఁగక। కన్నులుదెఱవంగనెఱుఁగకవసుంధరపైఁ। గొన్నిది
నంబులుబ్రాహ్మణుఁ। డున్నట్లనయుండె నొంటియూరుపుతోడన్॥ క॥ ఇటుబ
హువిధములఁగడుసం। కటపడిమాయాపురోపకంఠమునమరు। త్తటినీతటని
కటమునం। దటుకుననశివశర్మకాలధర్మమునొందెన్॥ అంత॥ మ॥ అసితాంభో
ధరనీలవర్ణులురుభద్రాకారులాజానుదీ। ర్ఘసముత్తుంగభుజాచతుష్టయు
లలంకారాన్వితుల్పుణ్యశీ। లసుశీలాఖ్యులువిష్ణుకింకరులులీలంబక్షిరాట్కే
తనో। ల్లసితంబైనరథంబుదెచ్చిరిరుచుల్నల్దిక్కులంబర్వఁగన్॥

సీ॥ వెలిదామరలఁబోలువెడదకన్నులతోడఁ గౌస్తుభగ్రైవేయకంబు
తోడఁ। బసిఁడికమ్మలపచ్చపట్టుపుట్టంబుతో మెఱుఁగుచామనిచాయమేనితో
డఁ। గీలుకొప్పుపసిండిగేదంగిఱేకుతోఁ గస్తూరికాంగరాగంబుతోడఁ। నటపీమ
యూరపింఛావతంసంబుతోఁ జిగురొత్తమొలకలేనగవుతోడ। నపుడసాక్షా
త్కరించినహరియుఁబోలె। నెక్కుశివశర్మగాంభీర్యమెసకమెసఁగఁ। గింకిణీ
జాలమాలికాలంకృతంబు। గరుడకేతనసహితంబుగనకరథము॥ వ॥ ఇట్లువి
మానారోహణంబొనర్చి శివశర్మవిష్ణుకింకరులంజూచి యిట్లనియె॥ గీ॥ విష్ణు

భక్తులు చెప్పంగవిందు నెప్పుడు। నేఁ బురాణేతిహాససంహితలయందుఁ। బుణ్యశీ
లసుశీలుర్ణ బుణ్యపురుషు। లచ్యుతునిసమ్ముఖమునసుంద్రధికులనుచు॥ గీ॥ వా
రుగారుగదావిూరువనజనేత్రు। లంబుధరనీలవర్ణులుకంబుగళులు। భద్రది
వ్యాకృతులుచతుర్బాహుదండు। లసితతులసీపలాశమాల్యాభరణులు॥ వ॥ అ
నినవారుమహాత్మాసీ యట్టిమహానుభావులెఱుంగని యర్థంబులుగల వెయేము
నీవుపెద్దలవలనం బురాణేతిహాససంహితాముఖంబుల విన్నపుణ్యశీలసుశీలుర
మగుమ మనేకలోకంబులుగడచికాని వైకుంఠపురమునకుంబోవ రాదయ్యె
యిలోకంబులవిశేషంబులునీకుం జెప్పెదము సావధానమతివై యవధరింపుమీ
వునుసడుగవలసినయర్థంబులడుగుమనినసట్లకాశయనిచనువాఁడుముందట॥
సీ॥ కలితులై పీడినకుఅచజుంజుఱువెంద్రుడు కలుసుగందెనచాయకాయములు
ను। గలివాసినాన్చినగ్రచ్చకాయలభంగిఁ గొఱదూలినట్టిదృగ్గోళకములు।
తోట్టవాతెఅలపై దూరంబుసాగిన గొగ్గిపండులతోడికుముఖములును। గూ
నివీఁపులమీఁదగోడిరైమెబోఁటెత్తి తరివడ్డకంకాళతండములును। రాసభక్రూ
రకంఠనిర్హ్రాదకలిత। ఘుర్ఘురావ్యక్తభాషితోద్గారములును। గలిగియిదె
కొండఱున్నారుగగనవీధి। నొరిమెగెడఁగూడుకొనియెవ్వరొక్కొ వీరు॥ వ॥ అని
వనద్దివ్యపురుషులతనికిట్లనిరి॥ గీ॥ ఇదిపిశాచలోకమింటధూమ్రవర్ణులు। వినుపి
శాచరాజులనఘవీరు। చంద్రశేఖరునిబ్రసంగవశంబునఁ। గొలిచినారుభక్తి
గొంచియుంబు॥ వ॥ అనియిట్లు గ్రమంబునఁ బ్రశ్నోత్తరరూపంబునఁ గర్మాను
రూపంబులఫలంబు లనుభవించుచునుండు రనిన నమరభావంబుల నుత్తరో
త్తరాభ్యున్నతంబులగు నాయాయిలోకంబుల వసియించియున్న పుణ్యపురు
షులంగనుంగొనుచు శివశర్మగుహ్యకలోకంబును గంధర్వలోకంబును విద్యా
ధరలోకంబును నతిక్రమించియప్సరోలోకంబునకుం బోవునవసరంబున॥ చ॥ ఎ
దురుగవచ్చెహేమరథమెక్కికృతాంతుఁడు సౌమ్యమూర్తియై। పదురునిజా
త్తకింకరులు పార్శ్వయుగంబునభక్తిఁగొల్చిరా। ముదిరనినాదముం జఱచి
ముందటిచక్కటిదివ్యదుందుభుల్। మృదులగభీరనాదములుమిన్నులుముట్టఁ
జెలంగుచుండఁగన్॥ గీ॥ ఎదురుగావచ్చిదక్షిణంబేలురాజు। ధర్మరాజుగరం
బుసంతసమెలర్ప। సాధుసాధుమహాబుద్ధిబోధమహిత। మేలుమేలనిశివశర్మమె
చ్చిపొగడె॥ సీ॥ అభ్యసించితివేదమాఱంగములతోడఁ బరిచర్య చేసితిగురుజ
నులకు। నాదిపురాణేతిహాసంబులును ధర్మశాస్త్రంబునదివితిసారధిషణ। సమ
బుద్ధిమైమహేశ్వరుఁ బుండరీకాక్షు సేవించితేకాంతశీలమునను। గైవల్యక
ల్యాణఘంటాపథములైన తీర్థంబులాడితితివిరియేడు। ననఘనీభాగ్యమునకో

దిమొంతగలదె। చూడుమాయెంతటిదియొనీసుకృతగరిమ। భూసురోత్తమమాయంతలేసివారి। చేసమస్కారములుగొనఁజెల్లెనీకు॥ వ॥ అనిధర్మండుశివశర్మనభినందించినిజనివాసంబునకుంబోయెఁ దదనంతరంబ॥ గీ॥ విప్రకులముఖ్యుఁడత్యంతవినయపరత। నిటులనని యెహ్వాపీకేశుహితులఁజూచి। యనఘులారయతిక్రూరుఁడంద్రుయముని। సౌమ్యుఁడై యున్నవాఁడెట్టిచంద మొక్కొ॥ గీ॥ యమునిరూపంబువర్ణింతురనఘజనులు। గుండెఝల్లనునట్లుగాఘోరలీల। జమునిఁజూడఁగఁగన్నులుచల్లనయ్యె। నిప్పుడారౌద్రరసరేఖయెందుఁబోయె॥ గీ॥ ఇదియురూపంబొయీతనికింకనొక్క। రూపమున్నదియోమహాక్రోధమునకు। నెఱుఁగనానతియిండునాకీరహస్య। మనఘమతులారసందేహమావహిల్లె॥ అనినవారలిట్లనిరి॥ క॥ నినుఁబోటిపుణ్యవంతుల। కనఘాశమనుండు సౌమ్యమగునాకారం। బునసుండుదుర్జనులకీ। యనరౌద్రాకారుఁడై యుదగ్రతచూపుౕ॥ వ॥ ఈదండధరుండుదంష్ట్రాకరాళవదనుండునుగ్రోధరక్తాంతలోచనుండునునూర్ధ్వకేశుండునుకృష్ణాంగుండును బ్రళయాంబుద నిస్వనుండును బరిభ్రమద్భ్రుకుటీకుటిలనిటలతటవిటంకుండునువిశంకటవికటాకారుండును నై దుర్వృత్తులనిట్లనిశాసించు॥ సీ॥ పాదంబులిరుచేతఁబట్టిగుంజుండుఝర్ఝరితంబుగావీనిఁజట్టుజాత.। మెడమెట్టిగోర్గొండి మెఱకిపుచ్చుఁడు వీనిగ్రుడ్లు చెక్కుల నెత్తురులు స్రవింపఁ। గడికండలుగ వీనికంఠంబు వ్రేయుండు గరసానఁబట్టిన ఖడ్గధారఁ। బలుత్రాళ్ళ బంధించి తలక్రిందుగా వ్రేలఁ గట్టుఁడు వీనివృక్షంబుకొమ్మ। అవపమునవీనిగంఠంబుద్రెంపి విడుఁడు। మడమతావుల వీనిమర్మములునొంపుఁ। డెఱ్ఱఁగానగ్నిఁగాఁగిన యినుపయిసుకఁ। గులికిపోయుఁడువీనిముక్కునను జెవుల॥ గీ॥ పరకళత్రంబుకుచకుంభపాళియందు। నఖముదివిచినపాపాత్మునఖమునందు। నెఱ్ఱఁగానగ్నిఁగాఁచినయినుపసూది। యుగ్రదృష్టినిజొన్పుఁడత్యాగ్రహమున॥ వ॥ పరదారముఖాఘ్రాణంబుచేసినపాపిష్ఠువదనంబుననిష్ఠురనిష్ఠీవనంబొనర్పుఁడు పరదారభావనగమనంబొనర్చినకర్మచండాలునిపాదంబులుప్రచండఖడ్గంబునఖండింపుఁడుపరదారాధరోష్ఠబింబంబుచుంబించునయ్యసంబంధుమూర్ధంబుద్ధతచపేటంబునం దాటింపుఁడు పరాపవాదపరునివక్షంబు లక్ష్యంబుసేసి తీక్ష్ణముఖనిశితక్షురప్రంబున నేయుఁడు పరసంతాపకారికటుకవచనుండగుకుటిలబుద్ధిని నింగలంబునం గాఁగిన మంగలంబునంద్రేల్పుఁడుపరునియందుమిథ్యాదోషంబారోపించునిర్దయుఁ బ్రతర్దనపూయశోణితకర్దమంబునముంపుఁడు గురునిందాకర్ణయగుధూర్తు నోరసంతర్ణతత ప్తలోహంబు పోయుండు పరకళంకప్రకాశకుండగు సంకసుకుచెవుల

నిశ్శంకకాలాయసశంకువులు గూర్చెదని దండధరుండు ప్రచండకోపాటోపంబునఁగింకరులంబలుకు వెండియు॥ గీ॥ కారవంబనఁగను మహారౌరవమనఁగ। గాలసూత్రంబు కుంభపాకంబు ననఁగ। నంధతామిస్రమనఁగ సంహారమనఁగ। నారకంబులు మఱియు నెన్నంగఁగలవు॥ వ॥ ఈనరకంబులయందు దేవస్వభోక్తల బ్రాహ్మణస్వభుజుల శిశుహంతలఁ గృతఘ్నుల గురుతల్పగుల గోఘ్న స్త్రీఘ్న మిత్రఘ్నులఁ బరక్షేత్రపరాయాపహర్తలఁ గూటసాక్షుల గర్భఘ్నులఁ బ్రజాపీడాకరులను రాపులఁ గూటశాల్మలిం బ్రాఁకించియుఁ బట్టుగార్లం బట్టియుఁదల క్రిందుగా వ్రేలఁగట్టియు నిక్షుయంత్రంబులం బీడించియు నంధకూపంబునం ద్రోపించియు నిసుపముక్కుల కాకులం గఱపించియు యమకింకరులు పెక్కువిధంబుల బాధపెట్టుదురు॥ క॥ హరినామకీర్తనంబును। హరినామజపంబు నెవ్వఁడావర్తించుఁ। నరకగుహావేదనయ। స్మరునకుఁ బ్రాపింపకుండు నయతత్త్వనిధీ॥ వ॥ ఈయర్థంబు నీకుం దెల్లంబుగా వించెద మాకర్ణింపుమాదికాలంబున సంగృతాంతుండు నిజకింకరులతో నిట్లనియె॥ సీ॥ గోవిందభూతేశ గోపగంగాధర చాణూరమర్దన చండికేశ। కంసప్రణాశన కర్పూరగౌర గోపీపతి శంకర పీతవసన। గిరిశ గోవర్ధనోద్ధరణ బాలమృగాంకవర్ణ మాధవ భవ వాసుదేవ। విషమేక్షణ మురారి వృషభధ్వజ హృషీకపతి భూతపతి శౌరి ఫాలనేత్ర। కృష్ణ హరిగరుడధ్వజ కృత్తివసన। కల్మషారి గౌరీపతిక మఠశూలి। యనుచుఁ బఠియింతు రెవ్వారు ఘనులు మీకు। వందనీయులు చెనకంగవలదు వారి॥ సీ॥ హరిరజనీశకళావతంస రమేశ్వర పినాకపాణి శ్రీరామ భర్గ। యనిరుద్ధ శూలపాణి నృసింహ త్రిపథగార్ద్రజటాకలాప మురహర యీశ। రాఘవ యురగాభరణ పద్మనాభ యుగ్రమధుసూదన పినాకపతి యాద్య। ప్రమథాధినాథ నారాయణ మృత్యుంజయ పురుషోత్తమ త్రిదశైకనాథ। యచ్యుత కామశత్రు వయజ్జపాణి। దిగ్వసన చక్రపాణి భూతియుత యనుచుఁ। దలఁతు రెవ్వారు వారలుత్తములు భువన। పావనాత్మకులందఱు ప్రభులు మీకు॥ సీ॥ బ్రహ్మణ్యదేవ కర్మముకుంద విశ్వేశ్వర సనాతన త్రినేత్ర రావణారి। శ్రీకంఠ ధర్మధురీణ శంభు వకమలాకర యీశాన యదుపతి మృడ। ధరణీధర హర యంధకహర శార్ఙ్గపాణి పురారి విష్ణు వనీలకంఠ। వైకుంఠ దేవదేవ మధురిపుఁడ త్రిలోచన కైటభరిపుఁడ చంద్రజూట। కేశినాశ గిరీశ లక్ష్మీపతి త్రిపు। రారి వసుదేవసూనుఁడ త్ర్యక్ష యనుచు। జపము సేయుదు రెవ్వరీ విపులపుణ్య। ఘనులఁ గదిసినప్పుడ మీకుఁ గల్లవచ్చు॥ వ॥ మఱియు వినుండు. శ్రీకాంత శివ యసురనిబర్హణ మన్మథరిపుఁడ జనార్దన ఖండపరశుఁడ శంఖపాణి శశిశేఖర దామోదర త్రిపురసూదన యంబుదనీలవా

ణువయానందకందన క్షేత్రవరయను నీదివ్యనామంబులు భావించుకృతార్థులు విూకుమాననీయులు నుండెయని యివ్విధంబుననంతకుండు గింకరవర్గంబున నుశాసించె నీహరిహర నామంబుల నష్టోత్తరశతంబువిన్నను బఠించినజనులకు నాయురారోగ్యైశ్వర్యంబులుసంభవించు॥ చ॥ శమనునిరాజధానియగుసంయమనీనగరంబు నంగరం। దమకురుధర్మసేన దృఢధన్వజయద్రథులాదిగా నృపో।త్తములునితాంతనిర్మలినధర్మధురంధరులుంద్రునిర్వృపా। యమునసనర్ఘ్యరత్నమయహారిహిరణ్మయహర్మ్యవీథులన్॥ వ॥ అసియివ్విధంబున॥ గీ॥ శమనలోకాభివర్ణనశ్రవణపరత। నుబుసుపోవంగశివశర్మ యొయ్యఁజేరె। నప్సరోలోకమద్రిపనూనాథుగునకు। లోకవిజయైకపట్టాభిషేకభూమి॥ వ॥ అప్పుడుశివశర్మ పుణ్యశీల సుశీలురకిట్లనియె॥ గీ॥ ఎవ్వరొకో వీరువిమలపూర్ణేందుముఖులు।దివ్యభూషామహారత్నదీప్తిజాల। పరిధిచక్రావరణమధ్యభావ్యమాన। భువనమోహనమూర్తులిప్పురమునందు॥ అనినవారలిట్లనిరి॥ సీ॥ ఏయిందుబింబాస్యలిత్తుకోదండుని త్రైలోక్యరాజ్యాధిదైవతంబు। లేయింతులకుఁబుట్టినిల్లుదుగ్ధాంభోధిమధ్యుకై టభారాతిమడుఁగుఁబావు।ఏచకోరాక్షులకింద్రచంద్రజయంతనలకూబరాదులుననుపుమిండ। రేపువ్వుబోఁడులయిసిరింతచూపులబుష్పలగట్టిమనంబులిగురువెట్టు। మహితభక్తిసేభామలమనుమరాంద్ర।దక్షిణానందవనమహాస్థానపతికి। భీమనాథేశ్వరునకు సుత్రాముఁడిచ్చె। ననఘవీరుసుమ్మయ్య యయ్యప్సరసలు॥

వ॥ ఊర్వశిమేనక రంభ చంద్రరేఖ తిలోత్తమవపుష్మతిలీలావతియుత్పలవతియలంబుసగుణవతి స్థూలకేశిక ళానిధి కర్పూరతిలకయుర్వరయనంగలతికమదనమోహిని చకోరాక్షి చంద్రకళ మునిమనోహరచారు నాససువర్ణికచారుపంజీవనిక్రతుశుల్క శుభానవతపశ్శుల్క తీర్థశుల్క దానశుల్క హేమావతిపంచాశ్వమేధిక రాజసూయార్థినివీరు మొదలుగా నఱువదివేలుదివ్యాప్సరలీలోకంబునందధివసింతురు॥ సీ॥ బ్రహ్మచర్యం బొక్కరాత్రిదైవికమునమఆచితప్పినయట్టిమాసకమ్మ। కలకాలమెల్లనుగామికవ్రతములుసలిపినట్టిచకోరశాబనయన। బలిమినొక్కనికిలోఁజడివానినవ్వేళఁబలిఁగాఁదలంచినపద్మగంధి। పురుషుఁడులేనియప్పుడుప్రమాదంబున మోసపోయినయట్టిముద్దరాలు। భోగదానవ్రతంబులు పూనియపుడు।మకరకేతనునర్చించుమాఁటినంగ।కన్నెవయసునఁగన్నెతికంబుదప్పి।పిదపఁబతిభక్తియగునాతిత్రిదశవేశ్య॥గీ॥మాంత్రికుండైనయొకసిద్ధమానినొండె। నొక్కవేలుపునొండెఁబ్రియుండువసుప।పుత్రసంతానలబ్ధికై పొందినట్టి।లోలలోచనకప్సరోలోకవసతి॥ వ॥ అనిచెప్పిననప్పరో

లోకంబు గనుంగొనుచు భాస్కరలోకంబు చేరంజని యేకచక్రంబునుసప్త
సప్తియుననూరు సారథికంబును నప్సరోమునిగంధర్వగ్రామణీ సమన్వితంబు
సునగురథంబుమీఁదఁ గరధృతారవిందద్వయుండయి నభోమార్గంబునంజను
కమలబాంధవునింజూపి విష్ణుకింకరులిట్లనిరి॥ సీ॥ సిద్ధాంతసంశుద్ధసిద్ధసంఘాతం
బువిధ్యుక్తపరిపాటివిబుధకోటి। చాటుధారాప్రౌఢిఁజారణవ్యూహంబుకిన్న
రవ్రాతంబుగీతిసరణి। ఖచరసంఘమువిశృంఖలవచోవైచిత్రియాతుధానశ్రే
ణియధికభక్తి। గరుడలోకమునమస్కారవాక్యంబునసేకాగ్రమతిదందశూ
కసమితి ప్రతిదినంబును ప్రాతరారంభవేళ। నిర్ణిబంధననిరుపాధినిరవగాధ। నిర్ణి
రోధనిరాఘాటనిరుపమాన। భక్తిసంభజియింతురీపద్మబంధు॥ సీ॥ సంచార
లోలుఁడౌ జగదుపక్రియుఁడవై సమధికస్థైర్యంబుజరుపుఁగాని। జనులదృష్టికి
వెక్కసంబై విభాసిల్లులోనఁజైతన్యంబునీనుగాని। సంతాపహేతువౌసంయ
మిశ్రేణికినిర్వాణలీలయీనేర్తుఁగాని। ఖరరుచిత్వముపూనుఁగాలక్రమంబు
నశీతలామృతమువర్షించుఁగాని। ప్రాగవస్థాభ్యధికతరోపర్యవస్థ। నతిశయిల్లు
చుభువనంబులఫలములును। వారకత్యంతసత్కృపావైభవమున। ననఘర
క్షించుచుండుసీయబ్జహితుఁడు॥ వ॥ అనిననప్పుడు శివశర్మదానొనర్చునమ
స్కారంబులంగీకరించుచు నిమేషార్థమాత్రంబున రెండువేల యిన్నూట
రెండుయోజనంబు లతిక్రమించినంగాంచి యాశ్చర్యంబంది గోవిందకింకరుల
కిట్లనియె॥ గీ॥ అనఘులారఖరాంశుబింబాంతరమునఁ। బురుషునొక్కనినుం
డఁజెప్పుచురుబుధులు। పరమతాత్పర్యగరిమనప్పురుషునెట్లు। సేవసేయుదు
రొక్కసంసిద్ధిపనులు॥ వ॥ అనినవారలిట్లనిరి॥ సీ॥ ఆకాశమధ్యస్థమగు భానుబిం
బంబువినులక్షయోజనవిస్తృతంబు। తన్మధ్యమునయందు ధవళాంశుశేఖరు
నుద్గీతవిద్యాప్రయోగసరణి। హైమరూపుఁడుహిరణ్యశ్మశ్రుకేశుండుహస్త
ప్రముఖహిరణ్యావయవుఁడు। గావిభావించియాకప్యాసలోచను నతఁడయే
నని సదా ధ్యానపరత। విమలమానసుఁడగుచు భావింపవలయు। బ్రహ్మవి
ద్వాంసుఁడగువాఁడు ప్రాహ్ణవేళ। నర్కునర్ఘోదయమునగాయత్రిఁగూర్చి। యు
ర్ఘ్యమొత్తినయాసమయంబునందు॥ వ॥ కాలలోపంబు సేయవలదు కాలంబు
ప్రతీక్షించునది కాలంబునంగదా యోషధులు ఫలించుఁ గాలంబునంగాకపా
దపంబులుపూచునెట్లు కాలంబుననే మేఘంబులువర్షించు మందేహదేహనా
శార్థం బుదయాస్తమయంబుల బ్రాహ్మణోత్సృష్టంబగుగాయత్రీమంత్ర
తోయాంజలిత్రయంబు చిత్రభానుం డపేక్షించుచుండుఁ గాలంబుదప్పకుం
డసముపాస్యమానుండయి భానుం డాయురారోగ్యైశ్వర్యంబులు ప్రసాదిం

షు॥ సీ॥ మేలైనరెండుతొమ్మిదులువిద్యలలోనమహనీయమగుచుమీమాం
సవెలయు । మీమాంసకంటెనుమేలుప్రాభవమునందర్కశాస్త్రముశుభోద
ర్కగరిమం । దర్కశాస్త్రముకంటెం దాసమభ్యధికంబువివరించిచూడంగ
వేదరాశి । యామ్నాయములకంటెనభ్యర్హితంబులుచర్చింపనుపనిషత్స
ముదయములు । నుపనిషత్తులకంటెనునూర్ధ్వపదవి । మంత్రరాజంబుగాయ
త్రిమహిమంగాంచుం । బ్రణవమనుక్రేవుతోంగూడిపాడింబిదుకు । నవనిసురు
లకుగాయత్రియనెడుసురభి॥ గీ॥ మంత్రములలోనగాయత్రిమహిమంగాంచు।
నగరములలోనంగాశియున్నతివహించు । దైవతంబులలోసుధాధామమౌళి।
విశ్వనాథుండుప్రాధానవిభవమొందు॥ స్రగ్ధర॥ గాతారంత్రాయతేనాంగలిగిన
తెలివింగర్గైగాయత్రిశర్థా । స్వీతంబైనామధేయంబితరమనువులందీప్రభా
వంబులేదీ । ప్రాతర్మధ్యాహ్నసాయోపగమములం బరబ్రహ్మమీమాంసు
లార్యుల్ । జ్యోతిర్మార్తిభజింతుర్స్వరగణవినుతుర్నూర్యనిత్సిద్ధవిద్యుల్॥
క॥ గాయత్రిపరబ్రహ్మము।గాయత్రికధీశ్వరుండుకమలాప్తుండుం(శ్రీ) । గాయ
త్రీమంత్రమునకు । నేయువియునుసాటివచ్చునేమంత్రమ్ముల్॥ వ॥ ఈవేదమూ
ర్తిహంసుండుభానుండుసహస్రాంశుండుతపనుండురవివికర్తనుండువివస్వం
తుండువిశ్వకర్మవిభావసుండు విశ్వరూపుండువిశ్వకర్తమార్తాండుండంశు
మాలియాదిత్యుండుష్ణగుండర్యముండుభగుండుయముండుబ్రధ్నుండుదివా
కరుండుద్వాదశాత్ముండుసప్తహయుండు భాస్కరుండహస్కరుండుఖగుండు
త్రిలోకేశ్వరుండు లోకసాక్షితమోరిశాశ్వతుండు శుచిగభస్తిహస్తుండుతీ
వ్రాంశుండు తరణిమిహిరారణి ద్యుమణిహరిదశ్వుండర్కుండు భానుమం
తుండు భయార్దనుండు చండాంశుండు వేదవేద్యుండు భాస్వంతుండుపూష
వృషాకపియేకచక్రరథుండుమిత్రుండుమందేహారితమిస్రహుండుదైత్యహుం
డుపాపహర్త ధర్మాధర్మప్రకాశకుండుహేళి చిత్రభానుండు కళిందుండుతా
ర్క్ష్యవాహనుండువికృతిపద్మినీనాయకుండు కుశేశయకరుండు ధర్మరశ్మిదుర్ని
రీక్ష్యుండుఅరుణుండుకశ్యపాత్మజుండుమీధుష్టముండు పరిష్టుండను నీడెబ్బది
నామంబులుగలిగియుండు॥ సీ॥ మోకాళ్ళభూమిపై మోపిహస్తాంబుజద్వయ
మునందామ్రమపాత్రముధరించి । యర్ఘ్యోదకంబులయందు దూర్వాంకురాక్ష
తములునవరక్తచందనంబు ।కరవీరముఖ్యరక్తప్రసూనంబులునైచియొక్కొ
కపేరువరుసతోడ । నందంబుగాంజతుర్థ్యంతంబుగాంబ్రణవాదిగాంబఠియిం
చుచఘ్యర్ఘపాత్ర। మౌళిపర్యంతమెత్తుచుమాటిమాటి । కర్ఘ్యమిచ్చినంబ్రీ
తుండైయర్కుండొసంగు । సేవకునకాయురారోగ్యధీవివేక । భాగ్యసౌభాగ్య

వైభవప్రాభవములు॥ సీ॥ అతిగుహ్యమైయకారాదిక్షకారాంతపంచాశదక్షు
రప్రకృతియైన । మాతృకయేమహామంత్రరాజంబునై దవయవంబులఁబుటి
యంధకార । మునకుసునోంకారమునకును కారంబు నకుబిందువునకునునాద
మునకుఁ । బ్రత్యేకమపదేసిపదియేసి వర్ణంబులనఘజన్యంబులై యతిశయి
ల్లు । నట్టిప్రణవంబు హేమసింహాసనముగ । భాస్కరుండనుమాణిక్యపదకభూ
ష । యఱుతధరియించి దేవిగాయత్రియొప్పుఁ । గడుపుచల్లంగ వేదాలఁగన్నత
ల్లి॥ క॥ సంశితవిజ్ఞానచతు.। ర్వింశతితత్త్వంబులకుని వేశనమగుసీ।యంశుమ
దధిపతిమంత్రమ । సంశయముగ నెప్పుడుమనకొసఁగునభిమతముల్॥ సీ॥మూఁ
డు వేదంబులుమూఁడుపాదంబులు నాభియాదిమపురాణవ్రజంబు।క్రిందుమీఁ
దునుజతుర్దిశలు నాల్గతుులు భువనంబు దేహంబుదివియుదరము । ధర్మశా
స్త్రంబుహృత్సరసిజముకుళంబు ఛందోవితతికుచ స్తబక యుగము । సాంఖ్య
శాస్త్రంబులుశ్రవణపాశంబులు జాతవేదుఁడువక్త్రచంద్రబింబ । మైదుదల
లుసుశిక్షాదికాంగకములు । చేష్టయాథర్వణశ్రుతిశిఖశిరుండు । బ్రహ్మమూ
ర్ధంబుహరియాత్మభావలక్ష్మి । ణములువిూమాంససావిత్రికమలచరిత॥ క॥
వ్యాహృతులతోడఁబ్రణవో । ద్గారిహముతోశిరముతోడఁగమలాప్తసమః।
ప్రాహుణకంబై యీమను। వాహుతిఁగొనుఁబాతకమ్మునునగ్నియుఁబోలెఁ॥
మ॥ క్షితిదేవోత్తమబ్రాహ్మణుండు వెలిగాజంహోభిచారక్రియా । క్రతుతం
త్రంబునశాస్త్రముంగుఱిచియీగాయత్రివర్ణావళిఁ । బ్రతిలోమంబునసుచ్చ
రించివిడువన్ బ్రహ్మాస్త్రమైలాఁకియా । ప్రతిపక్షుం దెగటార్చునంగుళిశిఖా
ప్రసోఫ్టమాత్రంబునన్॥ సీ॥ గాయత్రివిష్ణుండుఁయగాయత్రిశంభుండుగాయత్రిప
రమేష్ఠికమలనిష్ఠ । గాయత్రివిధివిష్ణుకమల సంభవమూర్తియైన మాతఁ
డుండుమానివర్య । గాయత్రిజపియించి గాయత్రిగొనియాడి కాంచువిప్రుఁడు
ముక్తికలితపుణ్య । గాయత్రిసేవించుకాలంబు గాలంబుమంత్రతంత్రములుని
ర్మలవివేక । యనఘసావిత్రియనఁగగాయత్రియనఁగ। విశ్వజనయిత్రియనఁ
జతుర్వేదమాత ।యనఁబరాపరబ్రహ్మాద్వయంబనంగ । నమ్మహాదేవికసమా
హ్వయాంతరములు॥ వ॥ అనిపుణ్యశీలసుశీలుదుసూర్యలోకమాహాత్మ్యంబభి
వర్ణింపనాకర్ణించుచుశివశర్మముందట నయానానందసందోహసంధాయి
యగునొక్క పట్టణంబు గనుంగొనియవ్విష్ణుగణంబులకిట్లనియె॥ గీ॥ పుండరీ
కాక్షులారయీపురవరంబు । నెఱయనుత్సవ మొనరించె నేత్రములకు । నెఱుఁ
గఁజెప్పుఁడు నాకదియేభువనమౌ । శోభితంబగుకారుణ్యవైభవమున॥ గీ॥అనిన
వారిదినముచిమదర్శనుని విడు। కనకగోపురకనకాట్టకనకసౌధ । కనకకుట్టిమ

వేదికాకవకభిత్తి। కనకరాజీవసరసీప్రకాశితంబు॥ సీ॥ చికిలించుకయుండుఁజి
గురుతెప్పలలోనఁగుసుమసాయకవైరినొసలికన్ను। పద్మనాభునికౌస్తుభము
కాంతిపాలిపోయెఁబద్మచన్నులమీఁది పసపుదాఁకి। ధళధళుక్కులనింగిదాఁ
టించిచనుఁగానినిలువనేరదుప్రాదిసీప్రకాశ। మస్తినాస్తిప్రకాశానుసారం
బునమినుమిస్తుమను చుండునవలుదీప్తిపగలువగలయ్యెశశివిభాప్రసరముసకు।
దానపోదిక్కుదీప్తిసంతానమునకు। వనఁగననఁగనుగనకవర్ణాభఁబైన। భా
నుఁడిప్పురివరసమీపమునసడచు॥ చ॥ అమవసలందుఁదానరసిజాప్తునిగర్భ
ముదూఱఁబోవునా। సమయమునన్ స్వకీయయగుచంద్రికయుల్లడవెట్టనో
సుమీ। యమృతమయూఖుఁడీనెలవునందనుసంశయమావహించెను। త్తమకు
లచూడుమిప్పురి సుధాధవళోన్నత సౌధవీధికల్॥ శా॥ పౌనఃపున్యమునన్ ఘు
టింపఁదొడఁగెన్ బ్రహ్మస్వయోత్తంసగా। స్త్రీనాగ్రంబునలేగపెయ్యయడె
కంటేకామధేనూద్భవం। బానందంబునడెందముబ్బఁగజనన్యాపీనవాపీసుధా।
పానోత్పుచ్ఛమనూనమైచటులరుఘింపాతాండవాటోపముల్॥ శా॥ కంటేస్వాఃకరికంఠపీఠవిలుఠన్గ్రైవేయలోహోగ్రఘా। ఘంటాతంకృతిఁదారసౌధవలభీ
గర్భంబునందారొక్కొనన్। ఘుటాపీధిఁజరించుచున్నది పురింగారాముపాటిం
చివె। స్వాంతస్థిద్వ్యకరేణువభ్రముపథావింపంగదర్పోద్ధతిన్॥ క॥ నందనవనమ
దెన్నరణీబృందారకయెల్లపెద్దపృథివీరుహముల్। మందారకల్పతరుహరి। చం
దనసంతానపారిజాతాహ్వయముల్॥ మ॥ దివిజాధీశసుధర్మయన్ సభసము
ద్వీక్షింపభూదేవతెం। డవకైలాసమువోలెనున్నయది బ్రహ్మాండంబుతోరా
యుచున్। ధవళాధీశధరాట్టహాసవిమలద్రాఘిష్ఠశృంగాగ్రమై। యువదాతధ్వజ
శాటికాంచలచపేటాధూతజీమూతమై॥ సీ॥ చెఱువులేటికిరేలుశిశిరాంశుక
రములఁగరఁగుచంద్రోపలగిరులుగలుగఁ। గల్పవృక్షంబులు గలుగంగనేటికి
వలువలకైతంతువాయసమితి। గణకులేమిటికిసంకల్పార్థచింతకుఁజింతామ
ణిశిలాశ్రేణిగలుగఁ। గామధేనువులుగల్గఁగనేమిటికిమఱిదోదనంబునకునై
యోదనికులు। నాఁగసర్వపదార్థజన్మస్థలంబు। భూరికల్యాణవైభవకారణం
బు। విశ్వభువనైకవినుతంబువిబుధరాజ। పట్టణంబదిపంకజప్రభవవంశ॥ శా॥
శ్రీరాంభోనిధినిసంభవించినఘృతాచీమేనకామంజుఘో। షారంభాహరిణీతి
లోత్తమలువిశ్వాచీచకోరాక్షియు। న్స్వారాజప్రియవారభామినులునా
నాభూషణాలంకృతుల్। గారామారఁగజూచె దమన్ నలసీకంజాతములంజూ
డుమీ॥ వ॥ ఈయింద్రలోకంబునందుఁదరురత్నంబు పారిజాతంబు గాంతార
త్నంబూర్వశి వనరత్నంబునందనంబు తురగరత్నంబుచ్చైశ్శ్రవంబు గజరత్నం

బై రావతంబు రత్నరత్నంబు చింతామణిసప్తార్చిప్రభృతులగు సప్తలోకపాలు
రు నారదాదులగు మునులు దనుజమనుజదైత్యులు గంధర్వయక్షకిన్నరకింపురు
షులు సగరనలనహుషమాంధాతృదుందుమారాదివసుంధరాధిపతులు జ్యోతి
ష్టోమాది యాగంబులు చేసిన సోమయాజులుం దులాపురుషాదిమహాదానం
బులొనర్చినదాతలు సంగ్రామమందున పరాఙ్ముఖులై యక్లీబాదులై యాల్గి
నవీరులు వసియింతురని యనంతరంబ యగ్నిలోకంబున నర్చిష్మతీపురంబు చేరం
గొనిపోయి శివశర్మకుఁ బుణ్యశీలసుశీలు రిట్లనిరి॥ సీ॥ అమరావతీపురంబమర
విభుఁ డేలు నర్చిష్మతీపురంబనలుఁ డేలు। శ్రాద్ధదేవుం డేలు సంయమనీపురంబ
సురనాయకుండు పుణ్యవతి నేలు। నమలావతీపురంబంబునాయకుఁ డేలు వాయు
వేలు సుగంధవతీపురంబు। నలకాపురంబు యక్షాధీశ్వరుం డేలు నైశాని యేలుఁ
జంద్రార్ధమౌళి। యనిరి దిక్పాలపురములందవనిసురుఁడు। రెండవపురంబు వీ
క్షించి ప్రీతినుండె। నవుకు వర్ణింపఁ దొడఁగి రయ్యగ్నిలోక। మహిమ సంపద
గోవిందమాన్యహితులు॥ సీ॥ శిఖశర్మ కులకుని శ్చైరిఘస్రీదాతధరణీసు
రులకుఁ దీర్ఘంబు నహ్న్మి। యాశుశుక్షణిగురుం డవని నిర్జరులకు నగ్రవర్ణులక
గ్ని యాశ్రమంబు। దహనుఁ డేఁగడయును త్తమవర్ణభవులకుఁ బావకుండీశుఁ
డు బ్రాహ్మణులకుఁ। బ్రత్యయంబు తనూనపాత్తు బాడబులకుఁ బాఱులకనలుఁ
డు పారిజాతి। మాత్రశయాశుండు ప్రాణులకంతరాత్మ। చంద్రశేఖరమూర్తియు
మర్బుధుండు। సకలజగదుద్భవస్థితిసంహృతులకుఁ। గేవలమహేశభూతుండు కృష్ణ
వర్త్మ॥ మ॥ వివిధాజ్యాహుతిధూపదీపములునై వేద్యంబు నీయగ్నిమూర్త।
జవిగొంచు బిమ్మట భుక్తిముక్తులునవశ్య ప్రీతిగానిచ్చెదుర్ణ। జవిగొంద్రంబురు
హాసనాచ్యుతమహేశానాదిబృందారక। ప్రవరుల్సర్వహ్యాపీకతర్పణముగా
బ్రహ్మార్థపారంగతా॥ వ॥ అనినవిని శివశర్మ నైశ్వానరుండనంగ నెవ్వండె
వ్వనితనూజుండేప్రకారంబున నాగ్నేయంబైన తేజంబతనికి సంభవించె మహా
త్ములారా మెఱుంగింపుండనిన వారు నైశ్వానరమాహాత్మ్యంబు వివరింపందొ
డంగి యిట్లనిరి॥ సీ॥ విశ్వానరుండు నానీశ్వరభక్తుండు శాండిల్యగోత్రసంజాతుఁ
డనఘుఁ। డభినుత బ్రహ్మచర్యాశ్రమనిష్ఠుఁడై బ్రహ్మయజ్ఞములు తప్పకయొన
ర్చు। నియతుఁడై విజ్ఞాతనిఖిలశాస్త్రార్థుఁడై లోకతత్వజ్ఞుఁడై యేకతమున। నొ
క నాఁడు చింతించుచుండె నేయాశ్రమంబొక్కొ నాల్గింటిలోను త్తమంబు। భ
క్తి నేయాశ్రమంబు చేపట్టినవ్వా। డైహికాముష్మికసుఖంబులందవచ్చు। నిది
యమేలన్నయట్లుంటునదియ లెస్స। యన్నయట్లుండునొక్కొక్కయాశ్రమం
బు॥ వ॥ అదియెట్లనిన వర్ణాశ్రమాచారంబు శివప్రసాదద్వారంబున జ్ఞానసాధ

రాజసూయంబునను వైశ్యుండు వైశ్యసోమంబునను యజియింతురిదియాదిగా గలయవి మఱి యాశ్రమధర్మంబు లధ్యయనాదులు బ్రహ్మచారిధర్మంబులు గృహస్థధర్మంబు లగ్న్యాధానాదులు వనస్థధర్మంబు లరణ్యవాసాదులు యతిధర్మంబులు శ్రవణాదులు బ్రహ్మచారిగృహస్థవానప్రస్థభిక్షుకుల యాశ్రమంబులుత్తరోత్తరంబులుత్కృష్టంబులీచతురాశ్రమంబులవారును నిజధర్మానుష్ఠానంబుదప్పకయీశ్వరపూజాతత్పరులై సుసిద్ధివడయుదురు నాకుంజూడ నగ్నియాశ్రమంబులకునాధారభూతంబైన గృహస్థధర్మంబు ముక్తిసాధనంబై తోచుచున్నది సర్వాశ్రమంబులకు స్వరూపలాభంబు గృహస్థాశ్రమనిబంధనంబు గొండఱు వర్ణాశ్రమాచారనిష్ఠునకు బ్రహ్మనిష్ఠసిద్ధింపదు బ్రహ్మనిష్ఠయన సర్వవ్యాపారపరిత్యాగంబున ననన్యచిత్తంబునంజేసి బ్రహ్మంబు నెఱుంగుటయదిమార్గానుష్ఠాన కర్మత్యాగంబులకుఁ బరస్పరవిరోధంబుగావునఁ గర్మకారునియందుసంభవింపదండ్రు వర్ణాశ్రమ కర్మానుష్ఠానవంతునకు యథావకాశంబున బ్రహ్మనిష్ఠాతాత్పర్యంబు సుకరంబుగావునఁగర్మపరుండు బ్రహ్మంబు నెఱుంగండనునిషేధోక్తింబని లేదు పరదారపరిత్యాగంబున నాత్మదారపరితోషంబున ఋతుకాలాభిగమనంబునను బ్రహ్మచారియు రాగద్వేషకామక్రోధవర్జనంబున వానప్రస్థుండును నయాచితోపస్థిత దేహయాత్రమాత్రంబున భిక్షుకుండునై గృహస్థుం డఖిలాశ్రమంబులు దానకై కొను దేవయజ్ఞంబు పితృయజ్ఞంబు భూతయజ్ఞంబు మనుష్యయజ్ఞంబు బ్రహ్మయజ్ఞంబను పంచమహాయజ్ఞంబులుం జేసి వివిధిపాముఖంబున గృహస్థుండు ముక్తుండగుఁ గావున గారవాస్థ్యంబగు ధర్మంబు నంగైవల్యంబు వడసెద॥ మ॥ అనియత్యుత్తమవంశసంభవ వివాహాంబయ్యె శాస్త్రోక్తవి । ధ్యనురూపంబుగ భాగ్యలక్ష్మినతికల్యాణిగుణాన్వితశో । భనపుణ్యాకృతివిప్రకన్యక మహాభాగుండు విశ్వానరుం । డనుకూలస్థిరపుణ్యలగ్నమున వంశానందసంధాయియై॥ ఉ॥ చేడియనామధేయముశుచిష్మతియాచిగురాకుబోఁడికిఁ । వ్రీడయుఁ గేశభారమును వృత్తపయోధరముల్నితంబముల్ । బోడము నెమ్మనంబు రతిభావముతోడననాఁడునాఁటికిఁ । వీడఁగఁజొచ్చె బాల్యమును వీడఁగఁజొచ్చెఁదదీయచింతతోఁ ॥ సీ ॥ అనుదినంబును బ్రాతరారంభవేళల నోలగందంబు తోనుదకమాడి । యంచవన్నియతోడనందమైనమడుంగు నిద్దంపుపుట్టంబు నెఱయఁగట్టి । నెఱియుంగఁగూడిన నెఱిగూఁకటులుదాఁచి పొంకంబుగాఁగమ్మపూలుదుఱిమి । కాశ్మీరతిలకరేఖామధ్యమునయందుఁ బుణ్యంపుచిఱుబొట్టుపొందుపఱిచి । వినువు లేకగ్నిహోత్రంబు వేల్వఁబెట్టు । దీపధూపం

బు లోడఁగూర్చు దేవపూజ। కోగిరంబులుగావించు నోవ్వగాఁగ। బాలపౌ
త్రశుభహృదయంబుపల్లవింప॥ వ॥ అనంతరంబ యౌవనారంభంబున నారం
భోరువువినయవతియు వివేకవతియు విలాసవతియు విభ్రమవతియు శాంతిమతి
యు సౌజన్యవతియు సౌహార్దవతియునై శుశ్రూషాతాత్పర్యంబునం బతిడెం
దంబున కానందంబు సంపాదించుచుండం బెద్దగాలంబరిగిన॥ గీ॥ కానరాద
య్యెఁబుత్రసంతానలబ్ధి। యెన్నినోములునోచిననిందుముఖకి। సంతనోకనాఁడు
తరుణియేకాంతవేళ। విభునిపాదంబులకు మ్రొక్కి విన్నవించె ॥ ఉ ॥ కట్టి
తిఁబట్టుపుట్టములు కాంచనభూషణముల్ ధరించితిం। బెట్టితిబంధుకోటికినభీప్సి
తవస్తుచయంబుకీర్తి చే। పట్టితినీపదాబ్జములుపాయకనిచ్చలు సేవ సేయఁ
గాఁ। బట్టివసుంధరంగలరెభామలునాసరిభాగ్యసంపదన్॥ క॥ సకలైశ్వర్య
సమృద్ధులు। నొకతలసంతానలాభమొకతలయదియే। టికిఁదడసె నిందు శే
ఖా। మకుటునికృపయేల లేదుమనకిప్పాటన్॥ క॥ చింతించిచూడవచ్చిన।సం
తానమువంశమునకుసకలంబునసున్। సంతానమునురధేనువు। చింతామణిసి
ద్ధరసముచిరతరపుణ్యా॥ వ॥ సంతానంబుగలుగునట్టియుపాయంబు విచారిం
పుమనిప్రార్థించిన॥ ఉ॥ ఇంతవిచారమేమిటికినిందునిభాసన నెమ్మనంబులో।
సంతతిలబ్ధికై విడువుశంకశశాంకకళాకిరీటుఁగా। ల్గాంతకుఁగాశికానగరహాట
కనిర్మలహర్మ్యమాలికా। భ్యంతరవర్తి విశ్వపతి నాశ్రితవత్సలునాశ్రయిం
చెదన్॥ వ॥ అనివవినిశుచిష్మతీదేవి యర్చిష్మత్ప్రభావుండగు భర్తకు వెం
డియుం బ్రణమిల్లి పాణిపల్లవంబులు మొగిడ్చి వినయవినమితోత్తమాంగయై
యార్యపుత్ర।పుత్రసంతానలాభంబు నాయందుంబడయ నభిమతంబయేనియే
నుంబ్రసాదభాజనంబగుదు నేనినిందు శేఖర సదృశుండైన నందనుంబ్రసాదిం
పుమనుటయు॥ గీ॥ ధర్మగేహినిపైఁగలకూర్మిపేర్మి। సంశితవ్రతుండైన వి
శ్వానరుండు। వనరుహాయతనేత్ర గోరినవరంబు। మునికులశ్రేష్ఠుఁడిచ్చితిన
నుచుఁబలికె॥ సీ॥ ఇదిమనోరథవీథి నెట్లుఁచొరఁగవచ్చు నేయింతిపతివేఁడని
ట్టివరము। వరము వేఁడిన వేఁడనచ్చుఁగాకిబ్బంగి నీనేరవచ్చునే యీప్సితార్థ।
మాగమంబులుసమానాధికరహితుఁగా శిశిరాంశుశేఖరుఁజెప్పుచుండు। సత
డలీలావతారార్థ మీచపలాక్షి దనకుఁగారణముగాఁదలఁచెనొక్కొ। కా
నినాఁడిట్టితలఁపెట్లుగలుగనేర్చుఁ। దరుణిశించువితర్కించుఁ దరతరంబ। యొ
కేమహాత్మంబుసేవునైష్ఠికతపూని। శంభుభక్తిపరుండువిశ్వానరుండు॥
వ॥ అనంతరంబయమ్మునీశ్వరుండు తపఃప్రభావంబున భవునిఫాలలోచనుభ
ర్గుభాగీరథీరథవనుభక్తినిధిభావనాసుల భస్వభావుభజింతుంగాక యని

భవభయోదన్వదుత్తారయానపాత్రంబైన కాశీక్షేత్రంబునకుంజని॥ సీ॥ మం
దాకినీవారిమణికర్ణికాంబువు వాపికాకూపపల్వలజలంబు। కుండికాసలిలం
బుగుల్యాప్రపూరంబు సెలయేటిపాథస్సు చెలమనీరు। ధారాశ్రుపీటంబుదమ్మి
వాపిపయస్సుగాసారనీరంబుగ్రయ్యత్తోయ। మూటకుండముబుగ్గయుదకంబు
జలపుష్కరమునద్రహదశంబరంబులివియు। మొదలుగాసర్వసర్వతోముఖ
ముగాశి। తీర్థరాజంబులుగసమర్థించుశ్రుతులు। గావననిన్నింటియందువిశ్వా
సరుండు। దేవసంకాశుఁడతిభక్తిఁదీర్థమాడె॥ గీ॥ అవనిదివిజుండుమణిక
ర్ణికాదిపుణ్య। తీర్థములయందుదేహంబు తేల్చి తేల్చి। శాంతిఁబొదించెఁ
బ్రాగ్జనుశ్శతసహస్ర। పరిచితంబైనబహుళతాపత్రయంబు॥ సీ॥ భద్రేభ
ముఖులకుభద్రకాళికలకుఁ గాలభైరవులకు గణములకును। నాదికేశవము
ఖ్యులైనకేశవులకు లోలార్కముఖులైనహేళులకును। బ్రణమిల్లిసురధునీ
మణికర్ణికాతీర్థ ములనుబిండప్రదానములఁబెట్టి। పాయసాపూపాదిబ
హువిధాన్నంబుల జగతీమరుత్సహస్రంబుదనిపి। కానవచ్చినయుబ్బులింగం
బులకును। గానరానినిగూఢలింగంబులకును। బుణ్యవాసరములమహాపూ
జచేసి। యాతఁడిట్లువితర్కించెనాత్మలోన॥ వ॥ ఓంకారేశ్వరుండుగృత్తివా
స ఈశ్వరుండు కాళేశ్వరుండు వృద్ధకాళేశ్వరుండుకళశేశ్వరుండుకైదారేశ్వ
రుండుగామేశ్వరుండు చంద్రేశ్వరుండు త్రిలోచనుండుజ్యేష్ఠేశ్వరుండుజంబు
కేశ్వరుండుజైగిషవ్యేశ్వరుండు దశాశ్వమేధేశ్వరుండు ద్రుమిచండేశ్వరుం
డుగోకర్ణేశ్వరుండుడిండీశ్వరుండుగజసిద్ధేశ్వరుండుధర్మేశ్వరుండు దారుకేశ్వ
రుండుచండికేశ్వరుండుమోక్షేశ్వరుండుగంగేశ్వరుండుపత్రేశ్వరుండు త్రిపురే
శ్వరుండుమార్కండేశ్వరుండు మణికర్ణేశ్వరుండుయమునేశ్వరుండు లాంగ
లేశ్వరుండుశ్రీవిశ్వేశ్వరుండు విముక్తేశ్వరుండువిశాలాక్షీవ్యాఘ్రేశ్వరుండు
వారాహేశ్వరుండుమాహేశ్వరుండువృషభధ్వజుండు వరుణేశ్వరుండు విధీశ్వ
రుండువసిష్ఠేశ్వరుండు సోమేశ్వరుండింద్రేశ్వరుండుసంగమేశ్వరుండుహరిశ్చం
ద్రేశ్వరుండు త్రిసంధ్యేశ్వరుండు భవానీశ్వరుండు కందుకేశ్వరుండు మహే
శ్వరుండు మిత్రావరుణేశ్వరుండు ననసిద్ధామృతజ్యోతిర్లింగాదులగుమహేశ్వ
రులు శతసహస్రసంఖ్యలంగల రీమహేశ్వరుల సిద్ధస్థానంబుల నెందేనిదివ్యస్థా
నంబునందపంబాచరించి శీఘ్రసంతానలాభంబు నొందుదు॥ గీ॥ అహాహ
తెలిసితివిస్మృతంబైనయర్థ। మేలసందేహమందంగహృదయవీథి। సిద్ధసంసే
వితముసర్వసిద్ధికరము। దర్శనస్పర్శనములఁదీర్థములరాజు॥ సీ॥ ఉద్ఘాటి
తంబులైయుండు రేలుపగళ్ళుగ వనితల్పులునాగళటకముపకు। సర్వజంతువుల

ఘనసంసిద్ధిసంపద గరతలామలకమైకానవచ్చు। వికటమహాదేవి విశ్వనాథుని భామపర్వతాధిపుపుత్రిపాయదెవుడు। సిద్ధివినాయకక్షేత్రపాలకులుద్రుపరిరక్షకులై కతత్పరతవూని। భూమితిలమాత్రమునువృథవోవకుండ। నమృతలింగంబులర్బుదన్యర్బుదములు। గలవుతీర్థాధిరాజ్యంబుగాశియందు। మహిమకావాసమవిముక్తమంటపంబు॥ క॥ ఎందుండునువిశ్వేశ్వరుఁ। డిందుకళాధరుఁడుగిరిదుహితృసహితుఁడై। యెందుండుభుక్తిముక్తులు। సందేహములేదుదపమచటనొనరింతుర్॥ సీ॥ అప్సరోంగనలెల్లనాటపాటలవెంటఁబ్రాపించిరిమనోరథార్థసిద్ధి।గంధర్వుఁడొక్కఁడుగానవిద్యాప్రౌఢిమంబునందపంసిద్ధిగాంచె।యక్షపుంగవుఁడువిద్యాధరశ్రేష్ఠుండుకోకిలాలాపయనొక్కమలియును। శతరుద్రమంత్రైకజపపరాయణుఁడైన వేదశిరుండనువిప్రవరుఁడు। చంద్రవహాళిభరద్వాజసంయములును। హంసపదియనునొకకిన్నరాంగనయును। నాప్రవాళోష్ఠిమగఁడువేయప్రియుండు। సిద్ధిబొందిరియవిముక్తసీమయందు॥ క॥ సిద్ధమరుత్సాధ్యాదులు। సిద్ధింబ్రాపింతురంద చిరకాలమునన్। సిద్ధమిదియగుటశంభుఁ। డుద్ధరణినిసిద్ధలింగమనఁగావెలయున్॥ వ॥ అమ్మహాజ్యోతిర్లింగమూర్తి విశ్వేశ్వరుండవంబ్రసిద్ధివహించె నమ్మహేశ్వరుండు జయద్రథునకువినూనునకుమగధాధిపతికి వసుదత్తునకుమనోరథార్థంబుల చిరకాలంబునఁబ్రసాదించెనేనునువిశ్వేశ్వరమహాదేవునారాధించి యభిమతార్థంబులువేడసిదంగాకయనిచంద్రకూపంబుననభిషేకంబాచరించి సంకల్ప పూర్వకంబుగానియమంబువహించి యొక్కమాసం బేకాహారుండును నొక్కమాసంబున నక్తాశనుండును నొక్కమాసంబుయాచితాశనుండును నొక్కమాసంబుపయోవ్రతుండును నొక్కమాసంబుశాకఫలాశనుండును నొక్కమాసంబుపిష్టతిలాహారుండునునొక్కమాసంబుపానీయభోజనుండును నొక్కమాసంబుపంచగవ్యాశనుండును నొక్కమాసంబుచాంద్రాయణవ్రతుండునునొక్కమాసంబుగుశాగ్రజలపాయియు నొక్కమాసంబు వాయుభక్షుండును నొక్కమాసంబునిరశనుండునునై వత్సరంబుగడపి త్రయోదశమాసంబునంబ్రథమదివసంబున॥ సీ॥ హారులేడునేడుగత్న్యాంతరంబులు గాఁగనియమంబుమైనాఖ్నిలుపునాఁడు। వెండికట్టులతోడివేత్రంబుమాటుగా బంగారమునికోలపట్టువాఁడు। ఝుంకించిపరపృథగ్జనకోటిచఁదానఁ గఱకుచీఁకటివెన్నుసఱచువాఁడు। వసుమతీభృచ్ఛ్రేణివరుసతోఁగుఱిచూపి యొండొండకాన్పించుచుండువాఁడు। త్రిభువనస్థానపతియైన దివసకరుని। ప్రాప్తిహారపాలుండుప్రాచినోసలి। ఘుసృణలీలాలలామంబుబిసగహోప్పు। శౌరిసారథియ